# REWARD!



BRING 10 DIFFERENT WRAPPER STORIES AND THEIR WRAPPERS TO GET 3 MONOPACKS FREE




SOFT NON STICKY BUBBLE GUM

HURRY KIDS!

**OFFER CLOSES 31st MARCH '96**

- Look out for wrapper stories inside Big Babol monopacks only
- Collect the reward from your nearest dealer
- Offer available in select cities

PERFETTI

McCann/PERFETTI/ 995

# ANNOUNCING THE



**The first six books, splendid in their content, press, marking the Golden Jubilee of Chanda**




A novelette on three lads befriending an unusual stranger – and their strange adventure, in a village turned into an island by flood.




A fairytale novella opening up into fascinating worlds and introducing gripping characters – rich with 42 imaginative illustrations.




A second selection of stories from the immortal Jaṭakas, unforgettable for their moral, wit, and wisdom.

**How to get the books at an easy price.**

If you are a subscriber to Chandamama (in any language) between the ages of 6 and 16, you are eligible to the membership of the Chandamama Young Scholars' Club. If you subscribe to Chandamama (in any language) before May 1996, the offer is open to you. You can fill up the form given here on the right side and mail it to us, while sending a token fee of Rs. 50. either by M.O. or by a bank draft drawn in the name of CHANDAMAMA YOUNG SCHOLARS' CLUB. You can then order all or any number of these books at much less than their original price. You get a handy gift of a School Companion Note Book and a decent badge.

What is more; you can participate in talent contests and different activities which the Club proposes to hold in the future.



# CHANDAMAMA BOOKS

**illustrations and production–are soon to roll out of the mama. Written by: Manoj Das. Illustrated by Sisir Datta**




A selection of legends and parables, some of which are believed to have been narrated by the Buddha, their radiance even now undiminished.




A garland of gems from the great treasure of India's folklore and ancient fiction. Each story has a message, as relevant today as it was ever before.




An invitation into the delightful world of ancient tales, legends and parables. Each story enriches us with prudence and helps us understand life better.

**MEMBERSHIP FORMALITIES WILL BE PROCESSED ONLY BY END OF FEBRUARY 1996.**

MEMBERSHIP CARD







School Companion Note Book




BADGE

NOTE BOOK

Dear Sir,

Please enrol me a member of the Chandamama Young Scholars' Club.

My Chandamama subscription No. is...............................

I am sending my Membership fee of Rs. ...................... by M.O./Draft.
I look forward to my acceptance - gift.

Full Name : .............................................................. Signature

Name of Parents : ..............................................................

Mailing Address : ..............................................................

Permanent Address : ..............................................................

Date of Birth : ..............................................................

Class : ...................... School ..............................................................




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి



## బాలికలకూ సమాన అవకాశాలు!

గత సంవత్సరం అంతర్జాతీయ బాలికావత్సరంగా ప్రకటించిన ఐక్య రాజ్య సమితి విభాగమైన యూనిసెఫ్ 1995 డిసెంబర్‌లో కొన్ని వివరాలు సేకరించి, వెలువరించింది. బాలికల సంక్షేమానికి కొన్ని సూచనలు కూడా చేసింది.

ప్రపంచం మొత్తం మీద సరాసరి 100 మంది పురుషులకు 105 మంది స్త్రీలు ఉన్నారు. అయితే, మన దేశంతో పాటు కొన్ని దేశాలలో మాత్రం స్త్రీల కన్నా పురుషులే అధిక సంఖ్యలో ఉన్నారు. మన దేశంలో సగటున 100 మంది పురుషులకు 93 మంది స్త్రీలు ఉన్నారు. కాని కేరళ తోపాటు నాలుగు రాష్ట్రాలలో మాత్రం పురుషుల కన్నా స్త్రీలు ఎక్కువ ఉన్నారు.

స్త్రీలకంటూ ప్రత్యేకంగా సంక్షేమ పథకాలను రూపొందించి, పకడ్బందీగా అమలుచేసే రాష్ట్రాలలో స్త్రీల పరిస్థితి మెరుగ్గా ఉన్నది. అటువంటి ప్రాంతాలలో బాలికల స్థితిగతులు కూడా బాగున్నాయి. అధిక అక్షరాస్యతను సాధించిన కేరళ రాష్ట్రం ఈ విషయంలో అగ్రగామిగానూ, మిగతా రాష్ట్రాలకు ఆదర్శవంతంగానూ ఉంటున్నది. శిశు మరణాలు కూడా అక్కడ చాలా తక్కువ!



ఆడపిల్లలకు కనీసం ప్రాథమిక స్థాయి వరకయినా విద్య నేర్పడం చాలా అవసరం. తల్లిదండ్రుల ఆర్థిక స్తోమత, విద్యా స్థాయి, లభ్యమయ్యే వైద్య సదుపాయాలు మొదలైన వాటిని బట్టే పిల్లల సంక్షేమం ఆధారపడి ఉంటుంది.

ఇరవై ఒకటవ శతాబ్దానికి ఇక నాలుగు సంవత్సరాలే ఉన్నాయి. రానున్న ఈ నాలుగేళ్ళను బాలికా దశాబ్దంలో భాగంగా భావించి, పిల్లల మధ్య ఆడ-మగ అనే వివక్షతనూ, పక్షపాతాన్నీ పాటించకుండా ఇరువురికీ సమానమైన విద్యావకాశాలు కల్పించి, వారి భవిష్యత్తును తీర్చిదిద్దడం తల్లిదండ్రులు ప్రధాన కర్తవ్యంగా గుర్తించాలి!

సంపుటి : 98 ఫిబ్రవరి '96 సంచిక: 2

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00



# చిన్న మొత్తాల పొదుపు పథకంతో ప్రతిక్షణం మరింత ఆనందమయం



అమ్మాయి వివాహం అంతా సవ్యంగా జరిగింది. తండ్రిగా నేను కన్న కలలు నెరవేరాయన్న తృప్తి కలిగింది. ఈ రోజు కోసమే ఎన్నాళ్లనుంచో ఎదురు చూశాను. సంపాదించాను, పొదుపు చేశాను. అమ్మాయి స్కూలు చదువు, కాలేజి చదువు... పూర్తయి ఇప్పుడు నూతన భవిష్యత్తులోకి అడుగుపెడుతోంది. చాలా సంవత్సరాలకింద నేను తీసుకొన్న తెలివైన నిర్ణయం వల్లే ఇవన్నీ సాధ్యమయ్యాయి. ఆనాడు, నా సంపాదనలో కొంత **చిన్న మొత్తాల పొదుపు** పథకాల్లో పొదుపు చేశాను,

**చిన్న మొత్తాల పొదుపు పథకాలు** . . .జీవితాన్ని ఆనందమయం చేసుకొనేందుకు సరైన మార్గాలు.

## చిన్న మొత్తాల పొదుపు పథకాలు

### కిసాన్ వికాస్ పత్రం

- మీ పెట్టుబడి 5½ సంవత్సరాలలో రెట్టింపు అవుతుంది.
- 2½ ఏళ్ల తర్వాత డబ్బు తీసుకునే సౌకర్యం.
- ఈ పత్రాలు రూ. 100/-, 500/-, 1,000/-, 5,000/-, 10,000/-, 50,000/-విలువలలో లభిస్తాయి.
- పెట్టుబడిపై గరిష్ఠ పరిమితి లేదు.
- ఋణ సౌకర్యము
- నామినేషన్ సౌకర్యము కలదు.

### జాతీయ పొదుపు సర్టిఫికేట్

(8వ విడుదల)

- 12% చక్రవడ్డీ.
- కనీస డిపాజిట్ రూ. 100/-, గరిష్ఠ పరిమితి లేదు.
- ఈ సర్టిఫికేట్లు రూ. 100/-, 500/-, 1,000/-, 5,000/-, 10,000/-, విలువలతో లభిస్తాయి.
- ఋణ సౌకర్యం కలదు.
- పెట్టుబడిపై ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 88 ప్రకారం పన్ను రాయితీ.
- వడ్డీపై ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80L ప్రకారం పన్ను రాయితీ.

### 15 సం॥ల ప్రజా భవిష్యనిధి ఖాతా

- సంవత్సరానికి 12% చక్రవడ్డీ.
- సంవత్సరంలో కనీస డిపాజిట్ రూ.100, గరిష్ఠ డిపాజిట్ రూ. 60,000/-.
- 3వ ఆర్థిక సంవత్సరం నుండి ఋణ సౌకర్యం.
- 7వ ఆర్థిక సంవత్సరం నుండి డబ్బు తీసుకొనే సౌకర్యం.
- పెట్టుబడిపై ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 88 ప్రకారం పన్ను రాయితీ.
- ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 10 ప్రకారం వడ్డీపై పూర్తి పన్ను రాయితీ.
- ఖాతాలోని డబ్బు జప్తు చేయబడదు.

మరిన్ని వివరాలకోసం మీ దగ్గరలోగల తపాలా కార్యాలయాన్ని లేదా కలెక్టర్ కార్యాలయంలోని స్పెషల్ తహశీల్దారును గాని, జిల్లా పొదుపు అధికారిని గాని, అధీకృత ఏజెంట్లను గాని సంప్రదించండి.

  

**కమీషనర్,**
**చిన్న మొత్తాల పొదుపు.**
5 వ అంతస్తు, ఇన్సూరెన్సు బిల్డింగ్, తిలక్ రోడ్డు, అబిడ్స్
హైదరాబాద్ - 500 001 ఫోను : 234412, 232939

Apple / Small Savings

**మీ భద్రతే మా లక్ష్యం**

వార్తలు - విశేషాలు

# ఆంక్షల ఉపసంహరణ

రెండవ ప్రపంచ యుద్ధం (1939-45) ముగిసిన తరవాత దాదాపు ముప్పై సంవత్సరాల వరకు ఆయుధ ఘర్షణలలో బాధించబడిన దేశం వియత్నాం. స్వతంత్ర శక్తులు హొచి మిన్ నాయకత్వంలో ఫ్రెంచి సేనలను తరుమగొట్టడానికి ఎనిమిదేళ్ళు పోరాడవలసి వచ్చింది. ఫ్రెంచి సేనలు తిరిగివెళ్ళాక, 1954వ సం॥ జెనీవా సమావేశంలో జరిగిన ఒప్పందం ప్రకారం ఆ దేశం — కమ్యూనిస్టు ఉత్తర వియత్నాం, దక్షిణ వియత్నాం అని రెండుగా విడిపోయింది.

ఘర్షణలు అంతటితో ఆగలేదు. దక్షిణ వియత్నాంలోని కమ్యూనిస్టు గెరిల్లాలు, ఉత్తర వియత్నాం సైనికుల సహాయంతో దక్షిణ వియత్నాం సేనలపై పోరాటం కొనసాగించారు. దక్షిణ వియత్నాంకు అమెరికా సైనిక సహాయం అందించింది. 1959-69 మధ్యకాలంలో వియత్నాం యుద్ధానికి దాదాపు 5,50,000 సైనికులను అమెరికా పంపింది. వేలాదిమంది అమెరికా సైనికులు ప్రాణాలు కోల్పోయారు. వియత్నాంకు సైనికులను పంపరాదని అమెరికాలోనే వ్యతిరేకత బయలుదేరింది. 1972వ సం॥లో కమ్యూనిస్టులు పెద్ద దెబ్బ తీయడంతో, అమెరికా తన సేనలను ఉపసంహరించుకున్నది. అయినప్పటికీ ఆ ఇండో-చైనా ద్వీపకల్పంలో యుద్ధం ముగియడానికి మరొక రెండేళ్ళు పట్టాయి.

వియత్నాంలో తనకు జరిగిన శృంగభంగాన్ని అమెరికా మరువలేకపోయింది. అందువల్ల ఉభయ దేశాలు దాదాపు ఇరవైయేళ్ళు శత్రుదేశాలుగానే కొనసాగాయి. అమెరికా వియత్నాం మీద ఆర్థిక ఆంక్షలను విధించింది. 1992వ సం॥లో అమెరికా అధ్యక్షుడు జార్జ్ బుష్ ఆర్థిక ఆంక్షలను కొద్దిగా సడలించాడు. ఆ చర్య, ఆయన తరవాత అధ్యక్షపదవిని చేపట్టిన బిల్ క్లింటన్ 1994వ సం॥లో ఆంక్షలను పూర్తిగా రద్దుచేయడానికి నైతిక బలాన్ని సమకూర్చింది. ఒక సంవత్సరం తరవాత, వియత్నాంతో మామూలు దౌత్య సంబంధాలు మళ్ళీ ఏర్పరచుకోవడానికి అమెరికా ముందడుగు వేసింది. అబ్రహాం లింకన్‌ను తలపించే విధంగా బిల్ క్లింటన్, "గాయాలను మాన్పుకుని, సత్సంబంధాలను పెంపొందించుకోవడానికి తగిన సమయం ఆసన్నమయింది," అని స్నేహహస్తం సాచాడు.

ఆనందకరమైన ఈ పరిణామం అమెరికా-వియత్నాంల మధ్య స్నేహసంబంధాలు దృఢపడడానికీ, పెంపొందడానికీ మరింత దోహదం చేయగలదు.






# అలౌకిక లోకజ్ఞానం

విశాలపురంలో వుండే విశ్వనాథపండితుడి పేరు ప్రతిష్ఠలు దేశమంతటా వ్యాపించాయి. జగపతి అనే వాడాయనవద్ద శిష్యరికం చేయాలని, దూర ప్రాంతం నుంచి విశాలపురం వచ్చాడు.

పండితుడు జగపతిని సాదరంగా ఆహ్వానించి, "నా పాత శిష్యులందరూ అధ్యయనంలోవున్నారు. నీవు కొంతకాలం పాటు నాతో పాటే వుంటూ, నా వెంట తిరుగుతూ, నేను చెప్పినట్లు వినాలి. ఆ తర్వాత అధ్యయనం ప్రారంభించవచ్చు," అన్నాడు.

జగపతి అప్పటికి సరేనన్నట్టు తల వూపి, ఆ సాయంత్రం పాతశిష్యుల్లో ఒకణ్ణి కలుసుకుని, "విశ్వనాథ పండితుడు మంచివాడనుకున్నాను. కొంతకాలంపాటు నన్ను సేవకుడిలా ఉపయోగించుకునేందుకు చూస్తున్నాడు. గతంలో నీతో కూడా ఇలాగే ప్రవర్తించాడా?" అని అడిగాడు.

పాతశిష్యుడు నవ్వి, "ఆయనతో కూడా తిరగడం గొప్ప అదృష్టం. అధ్యయనానికి మించిన లోకజ్ఞానం అప్పుడే అబ్బుతుంది. లోకజ్ఞానంలేని పాండిత్యం వాసనలేని పువ్వు వంటిది. ఒకసారి ఆయనతో తిరగడం ప్రారంభిస్తే, ఇక అధ్యయనం మీదికి దృష్టి కూడా పోదు," అన్నాడు.

తనకున్నంత లోకజ్ఞానం ఇంకెవరికీ లేదని జగపతి నమ్మకం. లోకజ్ఞానం కోసమే అయితే గురువుతో తిరగడం వృధా అని వాడికి తోచింది. ఆ విషయం గురువుకెలా చెప్పాలో తెలియక, ఆ రాత్రి పడుకోబోయే ముందు విశ్వనాథ పండితుణ్ణి కలుసుకుని, "అయ్యా! మా ఊళ్ళో ప్రతి ఒక్కరూ, నా లోకజ్ఞానాన్ని మెచ్చుకున్నవారే! నా లోకజ్ఞానానికి పాండిత్యం జతపడాలని మీవద్దకు వచ్చాను. ఈ విషయం తమరు కాస్త గుర్తుంచుకోగలరు," అంటూ నర్మగర్భంగా చెప్పాడు.

"వసుంధర"



విశ్వనాథ పండితుడు అప్పటికి నవ్వి వూరుకున్నాడు.

మర్నాడు తెల్లవారు ఝామునే స్నానాది కాలయ్యాక గురువు జగపతిని పిలిచి, "వెళదాం పద! అప్పుడే నిద్రలేచిన ప్రకృతిని కళ్ళారా చూడాలి. అది ఎలా వున్నదో రాసుకోవాలి. ఈవిషయాన్ని మహాకవులెలా చెప్పారో పరిశీలించాలి. కవికీ కవికీ భేదం గమనించాలి. వాస్తవానికీ కవిత్వానికీ తేడా తెలుసుకోవాలి. అదే లోకజ్ఞానం అంటే — ఊఁ, పద, పోదాం!" అన్నాడు.

జగపతి, గరువుకు వినయంగా నమస్కరించి, "అయ్యా! అందమైన స్త్రీ ముఖాన్ని కవులు చంద్రబింబంతో పోల్చుతారు. కానీ స్త్రీ ఎంత దగ్గరగా వున్నా అందంగానే కనబడుతుంది. చంద్రుడుకూడా భూమి వంటి ఒక గ్రహం కావడంవల్ల, దగ్గర్నుంచి చూస్తే గతుకులబొతుకులతోఅసహ్యంగా వుంటాడు. అది కల్పన, ఇది వాస్తవం," అన్నాడు.

"నీకు చాలా తెలుసు. పద పోదాం!" అన్నాడు విశ్వనాథ పండితుడు.

ఆయన మెచ్చుకున్నప్పటికీ, తననింకా అధ్యయనానికి నియోగించలేదని బాధపడ్డాడు జగపతి. తప్పనిసరి కావడంవల్ల వాడాయన వెంట నడవసాగాడు.

దారిలో ముందుగా వారికి మహాకవి మల్లన్న ఎదురయ్యాడు. ఆయన నదీస్నానానికి వెళుతున్నాడు. విశ్వనాథపండితుణ్ణి చూడగానే ఆగి, నమస్కరించి, "ఆర్యా! ఈపూట తమరు మా ఇంటికి భోజనానికి వేంచేయాలి," అన్నాడు.

"ఏమిటి విశేషం?" అని అడిగాడు విశ్వనాథ పండితుడు.

"మా అత్తవారి ఊరునుంచి వంటవాడొకడొచ్చాడు. నలభీమపాకం వాడిది. నిజానికి నిన్నటితో అవసరం తీరింది. వాడి వంటల రుచి ఇంకా చూడాలని మరొక్కరోజుండమన్నాను. తమరుకాదనకూడదు," అన్నాడు మల్లన్న.

"ప్రస్తుతానికి నా ఆరోగ్యం అంత బాగా లేదు. కనీసం వారం రోజుల దాకా రుచులు నన్నానందింపజేయవు," అన్నాడు పండితుడు.

"వంటవాణ్ణి వారంరోజులాపగలిగేవాణ్ణే. కానీ రేపే నాకు ప్రయాణం పడింది. నకుల



పురం నరేంద్రుడికొక కావ్యాన్ని అంకితమివ్వాలి," అన్నాడు మహాకవి మల్లన్న.

"ఆ కావ్యంలో ఎవరో తప్పులెన్నారన్నావు కదా!" అన్నాడు పండితుడు ప్రశ్నార్థకంగా.

"అవును. వాటినెలా సవరించుకోవాలో తెలియక, తమరి సాయం కోరితే సమయం చాలదంటిరి," అన్నాడు మల్లన్న.

"కావ్యంలోతప్పొప్పులు చూడాలంటే శ్రద్ధగా చదవాలి. అందుకు కనీసం వారం రోజుల వ్యవధి కావాలి. అంతకాలం వేచి వుండడానికి నీకు సమయం చాలదు మరి," అన్నాడు పండితుడు, తప్పును మల్లన్నకే అప్పగిస్తూ.

"అంతా నాదురదృష్టం!" అని మల్లన్న వెళ్ళిపోయాడు.

అప్పుడు పండితుడు జగపతితో, "నా ఆరోగ్యంచక్కగా వుంది. భోజనం తప్పించుకునేందుకు అబద్ధం చెప్పాను," అన్నాడు.

ఇది విన్న జగపతికి చాలా సందేహాలు కలిగాయి. కానీ అడగలేక వూరుకున్నాడు. వాళ్ళు మరికాస్త దూరం వెళ్ళేసరికి భూస్వామి భూషయ్య ఎదురయ్యాడు. ఆయనకు ఊళ్ళో వ్యవసాయంతో పాటు పట్టణంలో వ్యాపారం కూడా వున్నది. ఆయన పండితుడికి నమస్కరించి, "అయ్యా! తమరీరోజు మా ఇంట భోజనంచేస్తారు. కాదనకూడదు. అన్ని ఏర్పాట్లూ అయిపోయాయి," అన్నాడు.

"ఏమిటి విశేషం?" అన్నాడు పండితుడు.

"అబ్బాయి అర్థశాస్త్రపఠనం, ఈరోజునుంచే ప్రారంభం," అన్నాడు భూషయ్య.

"మొత్తంమీద చదువులో కూడా వ్యాపార దృష్టి పోనిచ్చుకున్నావు కాదు. కుర్రవాణ్ణి అర్థశాస్త్ర నిపుణుణ్ణి చేస్తున్నావు," అన్నాడు పండితుడు నవ్వుతూ.

"అవునండీ! అందరూ కవిత్వం చదివితే వ్యాపారం ఆగిపోదూ? వ్యాపారం కూడా ప్రజాసేవ. నష్టపోకుండా ప్రజాసేవ చేయడానికి అర్థశాస్త్రం తెలియాలి. అన్నిశాస్త్రాలూ చదివిన మీరేమో ఎంత డబ్బిస్తానన్నా, మా అబ్బాయికి అర్థశాస్త్ర మొక్కటీ నేర్పడానికి నిరాకరిస్తిరి. పట్నం నుంచి పండితుణ్ణి రప్పించాను. అతడి ప్రతిభ ఏపాటిదో తమరు చెబితే బాగుండేది!" అన్నాడు భూషయ్య.

"ఈరోజుకు వచ్చేవాణ్ణే! కానీ మరొకచోట మాటిచ్చాను. అది తప్పడం వ్యాపారులకు తగునేమో కానీ పండితులకు తగదు మరి," అంటూ పండితుడు ముందుకు నడిచాడు.

కొంతదూరం వెళ్ళాక ఆయన జగపతితో, "భోజనానికి మరొకచోట నేనుమాటివ్వలేదు. భూషయ్యకు అబద్ధం చెప్పాను," అన్నాడు.

జగపతి మాట్లాడలేదు. కానీ తన గురువు అబద్ధాలకోరని బాధపడ్డాడు.

ఇంతలో వారికి పొరుగూరి రత్నాలవ్యాపారి రమ్యచంద్రుడెదురయ్యాడు. అతడు కూడా పండితుడికి నమస్కరించి, "మీకోసం బండి తెచ్చాను. తమరు మా ఊరువచ్చి, నాచేత సన్మానం పొందాలి. మా ఇంట విందు భోజనంచెయ్యాలి," అన్నాడు.

"ఏమిటి విశేషం?" అని అడిగాడు పండితుడు.

"ప్రతి మాసం దశమినాడు ఒక విశిష్ట వ్యక్తిని సన్మానించడం, మా ఇంట ఆచారం. మనదేశపు రాజు నన్నిందుకు మెచ్చుకొని 'సన్మాన సుధాకర' అంటూ బిరుదు కూడా ఇచ్చాడు. ఈ సారికి మిమ్మల్ని సన్మానించాలనుకున్నాను. పాండిత్యంలో మనదేశంలో మీకు మీరే సాటికదా!" అన్నాడు రమ్యచంద్రుడు.

పండితుడు నవ్వి, "మా దూరపు బంధువొకాయన పోయాడు. ఈ మాసంలో నేనే సన్మానాల జోలికీ వెళ్ళకూడదు. వేడుకలలో పాల్గొనకూడదు. కాబట్టి అన్యథా భావించవద్దు,"అన్నాడు.

"అంతా నా దురదృష్టం! మీరున్నారు కదా అని ఈ ఊరొచ్చాను. పక్క ఊళ్ళోచదరం





గపుఆటగాడొకడున్నాడు. అతణ్ణిపట్టుకోవాలి! వేగంగా" అంటూ వెళ్ళిపోయాడు రమ్యచంద్రుడు.

రమ్యచంద్రుడటుపోగానే పండితుడు, శిష్యుడితో, "నువ్వు గాభరాపడకు. మా దూరపు బంధువెవడూ పోలేదు," అన్నాడు.

జగపతికి మతి పోయిట్లయింది. అలా నడుస్తూ వాళ్ళొక మామిడి తోపు చేరుకున్నారు. లోపలఅడుగుపెట్టబోతూండగా, "అయ్యా! నేనూ తమతో రావచ్చునా?" అన్న మాటలు వినిపించి, ఇద్దరూ వెనక్కు తిరిగి చూశారు.

సన్నగా పీలగావున్న నడివయస్కుడొకడు, ముతక బట్టలు ధరించి వినయంగా నిలబడి వున్నాడు.

"ఏమిటి, ధవళయ్యా, ఏమిటి విశేషం?" అన్నాడు పండితుడు.

"అయ్యా! నేను పొలం పనులకు పొరుగూళ్ళో గిరాకీగా వుందని వెళ్ళి నెలరోజులైంది. నిన్ననే తిరిగివచ్చాను. ఈరోజు తమకు మా ఇంట్లో భోజనానికి ఏర్పాటుచేశాను. ఆ విషయంచెబుదామని వచ్చాను. నేను, తమవెంట కొంతసేపు ఇక్కడే ఉంటాను. భోజన సమయానికి మా ఇంటికి తీసుకు వెళతాను," అన్నాడు ధవళయ్య

"నీ ఇల్లు నాకు తెలియనిదా — భోజన సమయానికి అలాగే వస్తాను. ఈలోగా పనులేమైనా వుంటే చూసుకో," అన్నాడు పండితుడు అభిమానంగా.

"అయ్యా! ఒక చిన్న మనవి. నేను ఊరుకు వెళ్ళేముందు తమరు చెప్పిన గీతావ్యాఖ్యానం విన్నాను. నా మనసుకెంత తృప్తి కలిగించిందనుకున్నారు! మన ఊళ్ళో తమరు వారానికొకసారి గీతావ్యాఖ్యానం చెబుతూనే వుంటారు. నేను ఊళ్ళో లేక నాలుగు వారాలు వినలేకపోయాను. తమకిబ్బంది లేకపోతే, అది అడిగి తెలుసుకుందామనుకుంటున్నాను," అన్నాడు ధవళయ్య వినయంగా.

"సరే, పద!" అన్నాడు విశ్వనాథపండితుడు.

ఆ తర్వాత ఆయన గీతా వ్యాఖ్యానం చెప్పసాగాడు. జగపతి, ధవళయ్య శ్రద్ధగా వినసాగారు. చూస్తుండగానే భోజన సమయం అయింది.

గురువు ఏదో అబద్ధంచెప్పి, ధవళయ్యను వదిలించుకుంటాడనుకున్నాడు జగపతి. కానీ అయన శిష్యుణ్ణి వెంటబెట్టుకుని ధవళయ్య గుడిసె వద్దకువెళ్ళి, అక్కడ తృప్తిగా భోజనం చేశాడు. అక్కడి నుంచి తిరిగి ఇంటికి వెళు తున్నప్పుడు, "నీ లోకజ్ఞానం, నాగురించి ఏమ నుకుంటున్నది?" అని అడిగాడు విశ్వనాథ పండితుడు, జగపతిని.

ముందు తటపటాయించినా గురువు ప్రోత్సహించడంతో, జగపతి, "తమకు లోక జ్ఞానం శూన్యం అనిపిస్తున్నది. విందు భోజనా లనూ, సన్మానాలనూ కాదని, ఒక పూరి గుడి సెలో కడుపు నింపుకున్న తమరు లోకజ్ఞానం విషయంలో చాలా నేర్చుకోవాలి," అని ధైర్యం చేసి చెప్పాడు.

అందుకు విశ్వనాథ పండితుడు ఎంతో శాంతంగా, "మల్లన్న తనకావ్యంలోని తప్పులు దిద్దించుకోవాలనీ, భూషయ్య తన కొడుకు గురువుకు పరీక్ష పెట్టాలనీ, రమ్యచంద్రుడు సన్మాన సుధాకరుడన్న పేరు నిలబెట్టుకోవాలనీ నన్ను విందుకు పిలిచారు. ఆయా విషయాల్లో కూడా వారు నాకోసం ప్రయత్నించారే తప్ప, నామీద ఆధారపడలేదు. నేను కాకుంటే మరొ కరనుకున్నారు. కాయకష్టం చేసుకునే ధవ ళయ్య విషయం వేరు. అతడు నా పాండిత్యం కోసం, నా సాన్నిహిత్యం కోరాడు. అతడడిగిన గీతావ్యాఖ్యానం చెప్పడానికి మించిన విందు భోజనం నాకేముంటుంది. ఆ పూరిగుడిసె చేరుకునేముందే నా కడుపు నిండిపోయింది. ధవళయ్య వంటి శ్రోతతో మాట్లాడడమే పండితులకు విందుభోజనం. సామాన్యు లకు సంబంధించినంతవరకూ, నీకున్న లోక జ్ఞానం గొప్పదే! కానీ పండితులకుండేది అలౌకిక లోకజ్ఞానం అని గుర్తుంచుకో!" అన్నాడు.

జగపతి ఆయనకుచప్పున సాష్టాంగపడి, "గురువర్యా! ఇది నాకు మొదటిపాఠం. శిష్యు డుగా తమను సేవించుకుంటూ, నేనింకా ఇలాంటివెన్నో పాఠాలు నేర్చుకోవలసి వుంది," అన్నాడు.

ఆ క్షణం నుంచీ వాడికి లోకజ్ఞానం తెలి సినవాడినన్న అహం నశించింది.



# నిత్యానందం నిజాయితీ!

హేలాపురిలో, రాఘవేంద్రుడనే ధనవంతుడి ఇంట్లో నిత్యానందం అనే నౌకరుండేవాడు. వాడు ఇంట్లో అందరికీ, ఇంటి పనులతో పాటు బయటి పనులకూడా సాయపడుతూండేవాడు.

ఒకరోజున వాడికి, ఇల్లు ఊడుస్తూండగా వెనక గదిలోని మంచం కింద ఒక వెండి నాణెం దొరికింది. వాడు దాన్ని తీసుకుపోయి, సంగతి చెప్పి రాఘవేంద్రుడికిచ్చాడు. ఆయన నిత్యానందం నిజాయితీని మెచ్చుకుని, వెండి నాణాన్ని వాడికే ఇచ్చేశాడు.

కొద్దిరోజుల తర్వాత, రాఘవేంద్రుడి కుమార్తె తన వజ్రాలహారంకనిపించడంలేదనితండ్రికి చెప్పింది. ఆయన ఇంట్లో వున్న పెట్టెలూ, భోషాణాలూ అన్నీ వెతికించి, హారం కనబడక పోయే సరికి, నిత్యానందంతో పాటు ఇతర నౌకర్లను కూడా పిలిచి విచారించాడు.

"ఆ వజ్రాల హారం నాకు స్నానాల గదిలో రెండు రోజుల కిందటే దొరికింది, బాబూ!" అన్నాడు నిత్యానందం.

ఇది విని రాఘవేంద్రుడు కోపంగా, "రెండు రోజుల కిందటే వజ్రాల హారం దొరికితే, ఇప్పటి వరకూ నాకెందుకా సంగతి చెప్పలేదు?" అని ప్రశ్నించాడు.

ఇందుకు నిత్యానందం, "బాబూ! నాకు దొరికిన హారాన్ని మీకు ఇచ్చినా, ఎలాగూ నా నిజాయితీని మెచ్చుకుని, నాకే ఇచ్చేస్తారు గదా! ఎన్నో పనుల ఒత్తిడిలో వుండే మీకు మరింత శ్రమ కలిగించడం ఎందుకని, హారాన్ని నా దగ్గరే వుంచేసుకున్నాను," అన్నాడు.

ఆ జవాబు విని రాఘవేంద్రుడు తెల్లబోయాడు. — కోనే నాగవెంకట ఆంజనేయులు






## 8

[రూపధరుడి అనుచరులు తాము చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోలేదు. రూపధరుడు దూరాన ఉన్న సమయంలో, మాయావి ప్రేరేపించగా వారు సూర్యభగవానుడి పశువులను చంపి వంట చేసుకు తిన్నారు. దాని ఫలితం త్వరలోనే కనబడింది. నడి సముద్రంలో రూప ధరుడి పడవ మునిగిపోయింది. అందరూ అతి దారుణంగా సముద్రానికి ఎర అయ్యారు. ఒక్క రూపధరుడు మాత్రం ప్రాణాలతో వేరొక కొత్త తీరాన వచ్చి పడ్డాడు. —తరవాత]

ఆదేశాన్ని ఏలే రాజుపేరు మహామేధి. ఆయ నకు వారుణి అనే కుమార్తె ఉన్నది. తెల్ల వారుజామున ఆమెకొక వింతకల వచ్చింది. ఆ కలలో ఆమె స్నేహితురాలొకతె కని పించి, "ఏమే, వారుణీ? నీకింత సోమరి తనమేమిటే? బోలెడన్ని మాసిన బట్టలు ఉతకవలసి ఉందిగదా? రేపు పెళ్లికి మాసిన బట్టలు కట్టుకుంటావా? అంతా చూసి ఏమ నుకుంటారు? తెల్లవారుతూనే బట్టలు ఉత కపోదాం పద. నేను కూడా నీ వెంట సాయం వస్తాను. బండి ఒకటి సిద్ధం చేయించమని మీ నాన్నతో చెప్పు. అంతదూరం వున్న చాకి రేవుదాకా నడవటం చాలా కష్టం," అన్నది.

వారుణి వెంటనే నిద్రమేలుకుని తూర్పు తెల్లవారుతూ ఉండటం గమనించింది. ఆమెకలలో చెప్పినట్టు చేయ నిశ్చయించు కుని తల్లివద్దకు వెళ్లి బట్టలు ఉతకబోతా నని చెప్పింది. తరవాత తండ్రివద్దకు వెళ్లింది.



ఆయన అప్పుడే నాయకుల సమావేశానికి పోబోతున్నాడు.

"నాన్నా, నాకొక పెద్దబండీ కావాలి. నేను నదికి వెళ్లి ఈ పూట మనకున్న మంచిబట్టలన్నీ ఉతుకుతాను. ఎంతోకాలంగా మైలబట్టలు చాలా పేరుకుని ఉన్నాయి. చూడబోతే ఇంటి నిండా జనం ఉన్నారు. అందరూ ఎప్పటి కప్పుడు చలవబట్టలు తెమ్మంటారు," అన్న దామె తండ్రితో.

మహామేధి, "దానికేం భాగ్యమమ్మా? పని వాళ్ళతోచెప్పి నీకుకావలిసినంత పెద్ద బండి కట్టించుకో," అన్నాడు.

వెంటనే కంచరగాడిదలతో సహా బండి తయారయింది. వారుణికీ, దాసీలకూ సరిప డాభోజనపదార్థాలు తీసుకున్నారు. వారుణి బండీ ఎక్కి కొరడా తీసుకుని కంచరగాడి దలనుఅదిలిస్తూబండితోలసాగింది. చాలా మంది దాసీలు కబుర్లాడుతూ బండి వెనకే నడవసాగారు.

కొంతసేపటికి వారు నదివద్ద చాకిరేవు చేరుకున్నారు. కంచరగాడిదలను విప్పి నది ఒడ్డున మేతకు వదిలారు. తరవాత వారు మైలబట్టలను పోటీలు పడి ఉతక సాగారు. చాకిపని ముగియగానే వారందరూ సము ద్రతీరానికి వెళ్లి అక్కడ స్నానాలు చేసి, నది ఒడ్డుకు తిరిగి వచ్చి బట్టలన్నీ ఆరవేసి భోజ నాలు చేశారు.

తరవాత వాళ్లు పాటలు పాడుతూ బంతి ఆట ఆడసాగారు. ఆటలోబంతిప్రమాద వశాన నీటిలో పడిపోయంది. అదిచూసి అందరూ ఒక్కసారిగా కేకలు పెట్టారు.

ఈ కేకలకు రూపధరుడు నిద్ర మేలు కున్నాడు. అతను పొదలలోనుంచి బయటికి వచ్చి వారుణినీ ఆమె దాసీలనూ చూశాడు. మట్టికొట్టుకుని ఉన్నఅతనిఆకారాన్ని చూసి వారుణి దాసీలందరూ బెదిరిపారిపోయి చెట్ల వెనకా పుట్టలవెనకా దాగారు. వారుణి మాత్రం నిర్భయంగా వున్నచోటనే నిలబడింది.

రూపధరుడు అంతదూరాన ఆగి విన యంగా, "సుందరీ, నీవు మనిషివో, దేవతవో, నాకు తెలియదు. నీ ఎత్తూ, అందమూ చూస్తే దేవత లాగున్నావు. ఒకవేళ నీవు మనిషివే

అయితే నిన్ను కన్న తల్లిదండ్రుల మహా భాగ్యం ఏమని చెప్పాలి! నీ తోబుట్టువులెంత అదృష్టవంతులు! నిన్ను చేపట్టబోయేవాడు ఇంకా ఎంత అదృష్టవంతుడు! నేను అనేక దేశాలు తిరిగాను గాని, నీవంటి అందగత్తెను ఎక్కడా చూడలేదు. ఇప్పుడు నేను చాలా దీనస్థితిలో ఉన్నాను. ఇరవైరోజులు సముద్రం మీద పడరానిపాట్లు పడి నిన్ననే ఈ తీరాన వచ్చిపడ్డాను. నాకీ దేశం కొత్త. నన్ను కాపాడితే నువ్వే కాపాడాలి. నన్నూ నా స్థితినీ చూసి కనికరించి నాకు కట్టుకునేటందుకు తగిన వస్త్రం ఒకటి ఇప్పించు. మీ ఊరికి దారి చెప్పు. కరుణించి ఈ సహాయం చేస్తివా నీ పుణ్యం ఊరికేపోదు!" అన్నాడు.



"అయ్యా, నీవు తెలివిగల వాడివిలాగే కనిపిస్తున్నావు. సుఖమన్నది' దేవతలు ప్రసాదించవలిసిందే. కాని, నీ విప్పుడు మా దేశంలో ఉన్నావు గనక నీకు అన్నవస్త్రాలకు లోటుండదని నేను హామీ ఇస్తున్నాను. మా ఊరికి దారికూడా చెబుతాను. ఇది ఫైయాసియా దేశం, మహామేధి ఈ దేశానికి రాజు. నేనాయన కుమార్తెను," అన్నది వారుణి.

తరవాత ఆమె తన దాసీలను పిలిచి, "ఎందుకలా బెదురుగొడ్లులాగా పారిపోతారు. ఈయనకు తినటానికేమైనా ఇవ్వండి. నదిలో స్నానం చేయించండి," అన్నది.

దాసీలు రూపధరుడికి స్నానాలరేవు చూపించి, స్నానం అనంతరం వంటికి మర్దనచేసుకునే తైలమూ, కట్టుకోవటానికి బట్టలూ ఇచ్చారు. రూపధరుడు నదిలో దిగి తన శరీరంమీద పేరుకుని ఉన్న ఉప్పూ, మట్టి కడుక్కుని, శరీరమంతా నూనె మర్దనచేసుకుని, రాజకుమార్తె ఇప్పించిన బట్టలు కట్టుకుని, పులికాపు చేసిన విగ్రహంలాగా నిగనిగలాడుతూ ఇవతలికి వచ్చాడు. అతన్ని మొట్టమొదట చూసి వికారంగా ఉన్నాడనుకున్న వారుణి ఇప్పుడతన్ని చూసి స్వర్గంలో వుండే దేవతలాగా ఉన్నాడనుకున్నది. తనకు అటువంటి భర్త దొరికితే బాగుండునని ఆమెకు అనిపించింది. అతను శాశ్వతంగా తమ దేశంలోనే ఉండి పోవాలని ఆమె కోరుకున్నది.



అందుచేత ఈ కొత్త వ్యక్తి తన అతిథిగా రావటం కంటె, అతనంతట అతనే తన ఇంటికి వచ్చి ఆతిథ్యం కోరటం అన్నివిధాలా మంచిదని వారుణి నిశ్చయించింది.

దాసీలు ఆరిన బట్టలను పోగువేస్తుండగా ఆమె రూపధరుడితో ఇలా అన్నది: "మనం ఇక బయలుదేరి పోదాం. నీవు మిగిలిన వారితోబాటు నా బండి వెనకనే నడిచిరా. ఈ విధంగా కోటగోడలదాకా రావచ్చు. కాని నాతోబాటు నగరంలో ప్రవేశించవద్దు. నలుగురూ నోటికి వచ్చినట్టు మాట్లాడతారు. నగరం వెలుపల ఒక తోట వున్నది. అందులో విశ్రాంతి తీసుకో. నేను ఇల్లు చేరటానికి కొంత వ్యవధి ఇచ్చి, అప్పుడు బయలుదేరి నేరుగా మా ఇంటికి వచ్చెయ్యి. మా ఇల్లు పిల్లలను అడిగినా చెబుతారు. మా ఇల్లు చేరుకున్నాక ఎక్కడా ఆగకుండా నేరుగా లోపలికిరా. అక్కడ నీకు మానాన్నా, అమ్మా కనిపిస్తారు. నీవు సంకోచించకుండా మా అమ్మను సమీపించి, ఉపాయంగా ఆవిడతో ప్రసంగించి ఆతిథ్యం కోరు. నీ ధోరణి ఆవిడకు నచ్చిందంటే నీ పని సానుకూలమైనట్టే. మా రాజభవనంలో ఆవిడ మాటకు ఏనాడూ తిరుగులేదు. నీ అదృష్టం బావుండి ఆవిడ అనుగ్రహిస్తే నీకు ఎంత సహాయ మైనా లభిస్తుంది."

తరవాత వారుణి బండీ ఎక్కి కంచర గాడిదెలను అదిలించింది. అందరూ బయలు

తరవాత దాసీలు రూపధరుడికి భోజనం పెట్టారు. అతను భోజనం చేసి అప్పటికి చాలా రోజులయింది.

ఈలోపుగా జరగవలసినదాన్ని గురించి వారుణి దీర్ఘంగా ఆలోచించింది. ఆమె యుక్తవయస్కురాలు,పెళ్లికానిది.ఆదేశంలో అనేక మంది యువకులు ఆమెను పెళ్లాడటానికి సిద్ధంగా ఉన్నారు; వారినందరినీ ఆమె అదివరకే నిరాకరించింది. అటువంటి పరిస్థితిలో ఆమె రూపధరుణ్ణి తనవెంట నగరానికితీసుకుపోవటంభావ్యంగాఉండదు. ఎవడినో ఊరూ పేరూ లేనివాణ్ణి భర్తగా సంపాదించి వెంట తెచ్చుకున్నదని అందరూ ఆడిపోస్తారు.

దేరారు. వారు తోటను చేరగానే రూపధరుడు అక్కడ దిగబడిపోయాడు. మిగిలినవారు ముందుకు సాగారు. అప్పటికి సూర్యాస్త మానమయింది. రూపధరుడు తన ఇష్టదేవత అయిన బుద్ధిమతిని చాలాసేపు ధ్యానించి తానుకూడా రాజభవనానికి బయలుదేరాడు.

ఈ లోపుగా రాజకుమార్తె వారుణి ఇల్లు చేరుకున్నది. ఆమె అన్నలు అయిదుగురూ వచ్చి ఉతికిన బట్టలను లోపలికి తీసుకు పోయారు. అప్పుడే పొయ్యిలు రాజేసి వంట ప్రారంభించినట్టు వారుణి తెలుసుకున్నది.

రూపధరుడు నగరంలో ప్రవేశించాడు. కాని చీకటిలో అతన్ని ఎవరూ గమనించలేదు, పలకరించలేదు. అతనికి ఒక చిన్నపిల్ల నీటికుండతోసహా ఎదురయింది. రూపధరుడు అమెను పలకరించి, "చూడమ్మా, నేను పర దేశిని. నాకు మహామేధి మహారాజుగారి ఇంటికి దారి చూపగలవా?" అని అడిగాడు.

"నేను చూపిస్తాను రా, బాబయ్యా. నువ్విలా ఇక్కడివాళ్ళను పలకరించగూడదు, తెలుసా. పరదేశిలంటే ఇక్కడి వాళ్ళకు చాలా అను మానం. అందుచేత మాట్లాడకుండా, ఎవరి కేసి చూడకుండా, నావెనకనేరా!" అన్నదాపిల్ల.

ఆమె వెంట రూపధరుడు రాజభవనం చేరాడు. ఆ భవనం దేదీప్యమానంగా ఉన్నది. రూపధరుడు లోపలప్రవేశించటానికి జంకాడు. అతను చాలాసేపు అక్కడే నిలబడి అక్కడ ఉన్న దివిటీల వెలుగులో చకచకా పనులు



చేస్తున్న బానిసలనూ, నాలుగెకరాల పళ్ళ తోటనూ చూశాడు. చివరకతను సాహసించి లోపల ప్రవేశించాడు. వారుణి చెప్పిన ప్రకారమే అతను నేరుగా లోపలికి వెళ్ళాడు.

లోపల ఒక విశాలమైన చావడిలో నగరపు పెద్దలందరూ భోజనాలకు కూచుని ఉన్నారు. రూపధరుడు చావడికుండా నడిచి వెళ్లగా లోపల అతనికి రాజూ, రాణీ కనిపించారు. రూపధరుడు నేరుగా రాణిముందు మోకరించి, "మహారాణీ, నేనొక నిర్భాగ్యుణ్ణి! శరణార్థిగా మీ వద్దకు వచ్చాను. మీరూ మీ పరివారమూ పుత్రపౌత్రాభివృద్ధిగా వర్ధిల్లాలి! నేను స్వదేశానికి తిరిగి వెళ్ళిపోవటానికి మీరు నాకు సహాయం చెయ్యాలి," అన్నాడు.



భోజనాలుఅయ్యాక మహామేధి మహారాజు లేచి నిలబడి పెద్దలతో ఇలా అన్నాడు:

"మీరంతా భోజనాలు చేశారు. ఈ పూటకు ఎవరి మానాన వారు విశ్రాంతి తీసుకుని నిద్రపొండి. రేపు ఉదయం పెందలాడే మనమంతా సమావేశమై మన అతిథికి వినోదాలు చేకూర్చి తరవాత ఆయన ప్రయాణం సంగతి చూద్దాం. ఆయన స్వదేశం ఎంత దూరాన ఉన్నా సరే అక్కడికాయన సుఖంగా, క్షేమంగా చేరే ఏర్పాట్లు చేయటం మన విధి. మనం మంచి ఏర్పాట్లు చేసినప్పటికీ ఆయన కష్టాలుపడాలనిరాసిపెట్టి ఉంటే అదితప్పేది లేదు. ఒకవేళ ఈయన మానవరూపంలో అవతరించిన దేవతే అయినా కూడా అది మనకు కొత్త సంగతి కాదు. దేవతలు అప్పుడప్పుడూ నరరూపంలో మనని చూడవచ్చి మనతోపాటు విందు వినోదాలలో పాల్గొనటం అనాదిగా వస్తున్నదే!

ఈ మాటలు వినగానే రూపధరుడు, "మహారాజా, మీరలాటి అపోహ పడకండి. నేను దేవతను కాను, మానవుణ్ణే. అందులోనూ అష్టకష్టాలకు గురయిన మానవుణ్ణి. బహుశా నేను భరించిన బాధలు ఇంకొకరెవరూ భరించి ఉండరు. అందుచేత ఇంతటితో నైనా నా కష్టాలను గట్టెక్కించటానికి తమరు సాయపడండి. నాకు మిగిలి ఉన్న కోరిక ఏమంటే నా దేశాన్నీ, నా వారినీ ఒక్కసారి కళ్ళ చూసి మరణించాలని!" అన్నాడు.

అతను ఇలా చెబుతుంటే అక్కడ ఉన్న వారందరూ నిర్ఘాంతపోయి చూశారు. చివరికి ఒక వృద్ధుడు మహామేధితో, "రాజా, మన అతిథినేలమీదకూర్చునివుండటంమన మర్యాదకు లోపం.అందుచేత నీవు స్వయంగా ఈ పెద్దమనిషిని ఒక అసనంపై కూచోబెట్టి మనతోబాటు భోజనానికి ఆహ్వానించు," అన్నాడు.

మహామేధి లేచి రూపధరుడికి చెయ్యి ఇచ్చి తీసుకుని వచ్చి తన పక్కనే, తన పెద్ద కుమారుడు కూచుని ఉన్న ఆసనం మీద కూచోబెట్టాడు. రూపధరుడికోసం ఆ యువకుడు తన ఆసనాన్ని ఖాళీచేసి వేరే ఇంకొక చోట కూచున్నాడు. తరవాత అందరూ కలిసి భోజనాలు చేశారు.

ఈ మాటలు విని అందరూ రూపధరుడి పైన సానుభూతి ప్రకటించారు. అందరూ అక్కడినుంచి వెళ్ళాక రూపధరుడూ, రాజూ, రాణీ మాత్రం మిగిలారు.

రాణీ రూపధరుడికేసి తిరిగి, అతను ధరించిన దుస్తులు తాను కుట్టినవేనని గుర్తించి, "నాయనా, నిన్ను మొట్టమొదటి ప్రశ్న నేనే అడుగుతాను. నువ్వెవరు? ఎక్కడినుంచి వస్తున్నావు? నీ దుస్తులు ఎవరిచ్చారు? నువ్వు సముద్రంమీద కొట్టుకువచ్చానని చెప్పావు కాదూ?" అన్నది.

తాను సమ్మోహిని చెరనుంచి బయట పడినది లగాయతు ఈ దేశపు తీరాన వచ్చి పడేవరకూ జరిగిన కథ యావత్తూ రూపధరుడు వివరించి చెప్పాడు. తరవాత వారుణి రావటమూ, తను ఆమెకు తన దీనావస్థ గురించి చెప్పుకోవటమూ,ఆమె తనకు తిండీ బట్టా ఇవ్వటమూ కూడా దాచకుండా అతను వారితో చెప్పేశాడు.

అంతా విని మహామేధి, "అయ్యా, నా కూతురు చాలా పొరపాటు చేసింది. ఆమె మిమ్మల్ని తనవెంట తీసుకుని వచ్చి ఉండవలసింది!" అన్నాడు.

"మహారాజా, ఆమెను నిందించకండి. ఆమె నన్ను తనవెంట రమ్మనే అన్నది. కాని మనుషులకు వెరిచి నేనే జంకాను," అన్నాడు రూపధరుడు.

"మీరు మా అమ్మాయిని పెళ్ళాడి ఇక్కడే ఉండిపోతానన్నా నేను అభ్యంతరం చెప్పి ఉండను. మీరు సంకోచించి ఉండవలసిన అవసరం లేదు. ఈ రాత్రికి నిద్రపొండి. రేపు మీ ప్రయాణం ఏర్పాట్లన్నీ చేసి మీరు క్షేమంగా స్వదేశం పోయేలాగు చూస్తాను. నా ఓడలను మించిన ఓడలు గాని, మా నావికులను మించిన నావికులు గాని మీకు ప్రపంచంలో ఎక్కడా దొరకరు," అన్నాడు రాజు.

వారీవిధంగా మాట్లాడుకుంటూ ఉన్న సమయంలో రాణి రూపధరుడికి పక్కవేయించింది. రూపధరుడు తాను పడిన కష్టాలన్నీ మరిచి ఆ పక్కమీద పడుకుని సుఖంగా నిద్రపోయాడు. —(ఇంకావుంది)



# పొరుగువాళ్ళ సాయం

ఒక మండు వేసవి కాలంలో, రామాపురంలోని ఒక పూరి గుడిసెకు నిప్పంటుకున్నది. మంటలార్పేందుకు ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు బావుల్లోంచి నీరు తోడుతూంటే, ఆ నీటిని కొందరు మోసుకుపోయి కాలుతున్న గుడిసె మీద చల్లుతున్నారు. మరికొందరు దాపులనున్న చెరువుకు పోయి కావిళ్ళతో నీళ్ళు తెస్తున్నారు.

అయితే, ఇంత జరుగుతున్నా సింహాద్రి అనేవాడు మాత్రం దూరంగా వున్న ఒక వేపచెట్టు కింద కూర్చుని కూనిరాగాలు తీస్తున్నాడు.

ఆ సమయంలో దారివెంట పోతున్న పొరుగూరి వాడొకడు సింహాద్రిని చూసి ఆశ్చర్యపోతూ, "ఏమన్న మనిషివయ్యా నువ్వు! అంత మంది పొరుగింటి వాడికి సాయపడేందుకు నానా యాతనా పడుతూంటే, నువ్విక్కడ చల్లని నీడలో కూర్చుని కూనిరాగాలు తీస్తున్నావు?" అంటూ అడిగాడు.

అందుకు సింహాద్రి నిబ్బరంగా, "ఆ పొరుగింటి వాణ్ణి నేనే! ఇప్పుడు నా గుడిసె మంటలు ఆర్పేందుకు ప్రయత్నిస్తున్న వాళ్ళు, గతంలో నేను కోరినా చిన్నమెత్తు సాయం చేయలేదు. ఇప్పుడూ వాళ్ళు నాకు చేస్తున్న సాయం ఏమీ లేదు," అన్నాడు.

"అదేమిటి? నీ గుడిసె తగలబడకుండా వాళ్ళు చేస్తున్న శ్రమ నీకు సాయపడడం కాదా?" అని అడిగాడు పొరుగూరివాడు మరింత ఆశ్చర్యపోతూ.

"కానే కాదు! వాళ్ళు ఆపక్క నున్న తమ గుడిసెలూ, డాబా ఇళ్ళూ తగలబడకుండా, తమకు తాము సాయం చేసుకుంటున్నారు!" అన్నాడు సింహాద్రి.

—ఎస్. లలిత





# ఊహాసుందరి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కన్నుపొడుచుకున్నా కాన రాని, ఈఅర్ధరాత్రివేళ నక్కలూ, గుడ్లగూబలూ, విషసర్పాలూ, భూతప్రేతాల్లాంటి క్షుద్రజీవులూ తిరుగాడే, ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న పాట్లు చూస్తూంటే, నాకు జాలితోపాటు ఒక శంక కూడా కలుగుతున్నది. అదేమంటే— నువ్వు లోకంలో వుండే అత్యధిక సంఖ్యాకులైన మానవుల్లో ఒకడివా లేక మానసికంగానూ, శారీరకంగానూ అత్యున్నత స్థాయికి చేరిన స్థితప్రజ్ఞుడివా అన్నది. ఏది ఏమైనా, అపూర్వమూ, అలౌకికమూ అయిన అనుభవం స్థాయీ భేదం లేకుండా ప్రతి మానవుడికీ తప్పక దుఃఖ కారణమవుతుంది. ఇందుకు ఉదాహరణగా పుష్పశరుడనే యువకుడి

## బేతాళ కథలు



కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,"
అంటూ ఇలా చెప్పసాగాడు:

చాలాకాలం క్రితం, ఒకానొకదేశంలో పుష్పశరుడనేయువకుడుండేవాడు. అతడు రాజవంశానికి చెందినవాడు. గొప్ప ఐశ్వర్య వంతుడు, అంతకుమించి ఎంతోఅందగాడు. అతడికి ఎక్కడెక్కడినుంచో పెళ్ళిసంబంధాలు వస్తూండేవి. అయితే, అతడికి ఏకన్యా నచ్చేది కాదు. కారణమేమంటే, అతడి మనసులో ఒక ఊహాసుందరి చోటు చేసుకున్నది. అతడెప్పుడూ ఒక అసాధారణమైన సౌందర్య వతి కోసం వెతుకుతూండేవాడు.

గంధమాదన పర్వత ప్రాంతాలగల ఒక కొలనుకు ప్రతి పున్నమినాడు గంధర్వకన్యలు వస్తూంటారని, పుష్పశరుడు లోగడ విని వున్నాడు. మార్గమధ్యంలోని అరణ్యాల్లో క్రూర మృగాలుండడం వల్ల ఎవరూ సాహసించి అటుకేసి వెళ్ళేవారు కాదు. పుష్పశరుడు ప్రాణా నికితెగించి, తనస్వప్నసుందరినివెతుక్కుంటూ అక్కడికి చేరుకున్నాడు.

ఆ కొలను ఒక గంధర్వ రాజుది. అతడి కుమార్తెలు తరచూ జలకాలాడడానికి అక్కడికి వచ్చేవారు. అలా వచ్చిన ప్రియవాదిక అనే గంధర్వరాజు కుమార్తె, పుష్పశరుడి కంట బడింది. ఆమెను చూసిన మరుక్షణంలోనే, ఆమెను తన ఊహాసుందరిగా గుర్తించాడు. తన మనసులోని మాట ఆమెకు చెబుదామని అతడు అనుకుంటూండగానే, ప్రియవాదిక కొలనులో దూకి మాయమైంది.

పుష్పశరుడు నిరాశ చెందక, ఆ కొలను ప్రాంతంలోనే వుండిపోయాడు. రెండు పున్నములుగడిచాక, ప్రియవాదిక తిరిగి అతడికి కనిపించింది. ఈ సారి అతడు ఆమెకు కని పించకుండా చెట్లచాటున పొంచివుండి, హఠాత్తుగా ఆమె చేతిని దొరకపుచ్చుకున్నాడు. అయితే, ప్రియవాదిక అతడితో పెనుగులాడి, తనచేతిని విడిపించుకుని, కొలనులోకి దూకి మాయమైంది.

ఆమెను వెదికి పట్టుకుందామని పుష్ప శరుడు కొలనులోకి దూకబోతూండగా, "ఆగు!" అన్నగంభీరమైన కంఠస్వరం వినిపించింది. ఆవెంటనే గంధర్వరాజు, ముమ్మో

ర్తులాఒకేలావున్న ముగ్గురు కన్యలతో కొలను నుంచి బయటికి వచ్చి, పుష్పశరుడితో, "ఈ ముగ్గురూ నా కుమార్తెలే! వీరిలో నువ్వెవరిని ప్రేమించావో చెప్పు. ఆమెను నువ్వు సరిగా గుర్తించగలిగితే—ఆమెనునీకిస్తాను,"అన్నాడు.

పుష్పశరుడు, ఆముగ్గురి కేసీ పరీక్షగా చూశాడు. ఒకే గులాబీలోని రేకుల్లావున్న ఆ ముగ్గురిలో తానింతకుముందు చూసిన కన్య ఎవరు?అతడు ఆమెను గుర్తించడం అసాధ్యం అని నిస్పృహచెందుతున్న తరుణంలో, మెరుపులా ఒక ఆలోచన వచ్చి, వారి కుడి చేతులను పరిశీలనగా చూశాడు. వారిలో ఒకామె కుడిచేయిమణికట్టుదగ్గరకొద్దిగాకందివున్నది.

పుష్పశరుడు, ఆమెను గంధర్వరాజుకు చూపించాడు. గంధర్వరాజు సంతోషించి, "భేష్! సరిగ్గానే గుర్తుపట్టావు. మా ప్రియవాదికకు కూడా నువ్వంటే ఇష్టమే! అయితే, ఒక షరతు. శాంతగుణం మా దేవధర్మం. అది నువ్వు పాటించాలి. ఎట్టి పరిస్థితులలోనూ దానిని కోల్పోకూడదు. మా అమ్మాయి పట్ల అన్నివేళలలోనూ శాంతస్వభావం కనబరుస్తూండాలి. ఎప్పుడైనా నువ్వు కోపగించి, ఆమె మీద మూడుసార్లు చెయ్యిచేసుకుంటే నిన్ను వదిలివేస్తుంది. తిరిగి గంధర్వలోకానికి వచ్చేస్తుంది, గుర్తుంచుకో! ఈ షరతును నువ్వు పాటించినంత కాలం ఆమె నీతో వుంటుంది," అని చెప్పి, ప్రియవాదికను అక్కడ వదిలి, మిగతా ఇద్దరు కుమార్తెలతో అదృశ్యమయ్యాడు.



సిగ్గుతోతలవంచుకునివున్నప్రియవాదికను, అప్పటికప్పుడే పుష్పశరుడు గాంధర్వవిధిని వివాహమాడి, తన నగరానికి తీసుకువచ్చాడు.

కొన్నాళ్ళు గడిచాక పుష్పశరుడు తన భార్యతో, చిన్ననాటి స్నేహితుడి ఇంటికి వెళ్ళవలసి వచ్చింది. ఆ స్నేహితుడికొకకొడుకు పుట్టాడు. పిల్లవాణ్ణి ఊయలలో వేస్తున్నారు. ఆ వేడుకకు బంధుమిత్రులెందరో వచ్చారు. పుష్పశరుడు తనతో తెచ్చిన కానుకలను పిల్లవాడి తల్లికి ఇచ్చాడు. తను పిల్లవాడిని ఎత్తుకుని ముద్దు చేశాక, భార్యకు ఇవ్వబోయాడు.

అయితే, ప్రియవాదిక పిల్లవాణ్ణి చూస్తూనే ఏవగింపుగా ముఖంపెట్టి, గిరుక్కునవెనుదిరిగి



వెళ్ళిపోయింది. అక్కడున్నవారితోపాటు పుష్ప శరుడుకూడాఆమెప్రవర్తనకుఆశ్చర్యపోయాడు. ఇంటికివస్తూనే, ఆమెను, "పిల్లవాడినిచూస్తూనే అసహ్యపడుతున్నట్టు వెళ్ళిపోయావేం!" అని కోపంగా ప్రశ్నించాడు.

"వాడిని ఎత్తుకోవాలనిపించలేదు," అన్నది ప్రియవాదిక.

"అదే, ఎందుకలా చేశావని అడుగుతు న్నాను?" అన్నాడు పుష్పశరుడు.

"కారణంచెప్పను!" అన్నది ప్రియవాదిక.

ఆ వెంటనే పుష్పశరుడు, చెంపమీద కొట్టాడు.

ప్రియవాదిక కళ్ళ నీళ్ళ పర్యంతమయి పోతూ, "వాణ్ణిచూడగానే, వాణ్ణిగురించి మీకు తెలియంది నాకు తెలిసింది. వాడు పెద్దయ్యాక పరమ దుర్మార్గుడవుతాడు. ఎందరినో హత్య చేశాక, ఉరికంబం ఎక్కుతాడు. అటువంటి వాడిని ముట్టుకోవాలనిపించలేదు. ఇందుకు మీకు కోపంవచ్చింది. అయితే, ఇది మొదటి దెబ్బ, జ్ఞాపకం వుంచుకోండి!" అన్నది.

పుష్పశరుడికి తన తప్పు తెలిసివచ్చింది. తనకింకా రెండుఅవకాశాలున్నాయి. ఆ క్షణం నుంచీ అతడు భార్యపట్ల ఎంతో ప్రేమగా, జాగ్రత్తగా మెలగసాగాడు.

ఇదిజరిగిన నెలరోజుల తర్వాత, తప్పని సరిగా పుష్పశరుడు తనభార్యతో, నగరపాల కుని కుమార్తె పెళ్ళికి వెళ్ళవలసి వచ్చింది. అతడికి నగరపాలకుడు కావలసిన వాడు.

నగరపాలకుడు, పుష్పశరుడినీ, ప్రియవాది కనూ ఆప్యాయంగా ఆహ్వానించి కళ్యాణ మంటపానికి తీసుకువెళ్ళాడు. పెళ్ళికొడుకు, పెళ్ళికూతురిమెడలో మంగళసూత్రం కట్టడా నికి సిద్ధమవుతున్నాడు. అంతాకోలాహలంగా, అందరూ ఆనందంగా వున్న ఆ సమయంలో ప్రియవాదిక పెద్దగా ఏడవసాగింది. దగ్గర్లోవున్న నలుగురూ తెల్లబోయి వారికేసిచూడసాగారు.

అప్పుడు పుష్పశరుడుమృదువుగా భార్యను, "ఏంజరిగింది? ఎందుకలాఏడుస్తున్నావు?" అని ప్రశ్నించాడు. "ఏంచెప్పమన్నారు? వాళ్ళి ద్దరూ ఒకరికొకరు తగరు. పెళ్ళయ్యాక బద్ధ శత్రువుల్లాగా పోట్లాడుకుంటారు. వాళ్ళుచేయ బోయేది కాపురంకాదు, యుద్ధం!"అని ప్రియ

వాదిక ఏడుపు ఆపుకోడానికి వ్యర్థప్రయత్నం చేయసాగింది.

ఆమె మాటలు విన్న అతిథుల్లో ఒకడు పక్కవాడితో, "పాపం, భార్యను అదుపులో పెట్టలేని అసమర్థుడిలా వున్నాడు!" అన్నాడు.

అది విన్న పుష్పశరుడు కోపంగా ప్రియవాదిక భుజం పట్టుకుని గట్టిగా కుదుపుతూ, "ఇక చాలు, ఏడుపు ఆపు!" అన్నాడు.

"నామీద ఇలాచెయ్యిచేసుకోవడం, ఇది రెండవసారి!" అంటూప్రియవాదిక విసురుగా అక్కడినుంచి కదిలింది.

ఇదిజరిగినతర్వాత పుష్పశరుడు, భార్య పట్లమరింత జాగ్రత్తగా మసులుకోసాగాడు. అతడామెను ఎట్టి పరిస్థితుల్లోనూ వదులుకోలేదు. ఇంకావున్నది ఒకే ఒక అవకాశం!

కొద్దిరోజుల తర్వాత పుష్పశరుడు, తన పినతండ్రి కొడుకు హఠాత్తుగా చనిపోవడంతో భార్యను వెంటబెట్టుకుని, తన పినతండ్రి ఇంటికి వెళ్ళవలసి వచ్చింది. పోయినవాడిది పుష్పశరుడి ఈడే. వాడి భార్య, శవంమీదపడి ఏడుస్తున్నది. అదిచూసి అక్కడున్న చాలా మంది మౌనంగా మనస్సులో రోదించసాగారు.

అటువంటి విషాద సమయంలో ప్రియవాదిక నవ్వడం మొదలుపెట్టింది. అందరూ ఆమెను వింతగా చూడసాగారు. పుష్పశరుడు నెమ్మదిగా ఆమె చెవిలో, "అలా నవ్వకూడదు. చెట్టంత మనిషిపోయి వాళ్ళెలా బాధపడుతున్నారో చూడు!" అన్నాడు. అయినా, ప్రియ



వాదిక పొంగివస్తున్న నవ్వు ఆపుకోలేకపోవడంతో, పుష్పశరుడు కోపంకొద్దీ ఆమె చెంప మీద గట్టిగా కొట్టాడు.

ప్రియవాదిక వెంటనే నవ్వడం మాని పుష్పశరుడితో, "చనిపోయినవాడెంతో అదృష్టవంతుడు! అప్పుడేఅతడు ఒకచక్రవర్తి కొడుకుగా పునర్జన్మనెత్తాడు. అంత మహాయోగం పట్టినవాడి కోసం, అందరూ ఏడవడంచూసి నాకు నవ్వు వచ్చింది. సరే, నువ్వు మా తండ్రికిచ్చిన వాగ్దానాన్ని భంగపరిచావు. ఇక నీతో వుండలేను," అని, గంధమాదనపర్వతంకేసి బయలుదేరింది. ఆమెను ఆపడానికి పుష్పశరుడు ఎట్టి ప్రయత్నం చెయ్యలేదు. అలా నిర్లిప్తంగా చూస్తూ వుండిపోయాడు.

బేతాళుడు ఈకథ చెప్పి, "రాజా, ఈ జరిగినదాన్ని గురించి నాకు చాలా అనుమానాలున్నాయి. పుష్పశరుడు, గంధర్వరాజు పెట్టిన షరుతును ఎందుకు అతిక్రమించాడు? తనను విడిచివెళుతున్న ప్రియవాదికను ఆపడానికి ఎందుకు ప్రయత్నించలేదు? ఆమెపట్ల తనకున్న ప్రేమాదరాభిమానాలు క్షీణించడం చేతనా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మానవులకు, గంధర్వకన్యలకు మధ్య వివాహమనేది పూర్తిగా ధర్మవిరుద్ధం. అది వివాహమే కాదు. పుష్పశరుడికి, ప్రియవాదికపై గల ప్రేమలో లోపం ఏమీ లేదు. అయితే, అది అతడి మానవ స్వభావాన్ని మార్చలేకపోయింది. అలాగే ప్రియవాదిక గంధర్వ మనస్తత్వమూ మారలేదు. వారివారిధర్మాలలో గల వైరుధ్యం, వారిప్రవర్తనలలో బయటపడింది. దేవధర్మాన్ని మానవుడు పాటించలేడు. మానవుడు సంఘజీవి. స్త్రీపట్లగల ప్రేమ ఒక్కటే ఏమనిషిజీవితాన్నీ పరిపూర్ణంచేయలేదు. పుష్పశరుడు తనభార్యపైచెయ్యిచేసుకున్న మూడుసార్లూ, తనతోటి సంఘం తనగురించి ఏమనుకుంటుందో అని ఆలోచించాడే కాని, ఆమెకు తనిచ్చిన మాటను జ్ఞాపకంచేసుకోలేదు. అలాగే ప్రియవాదిక గంధర్వకన్యగా తనకున్న అసాధారణ శక్తితో, ఇతరుల భవిష్యత్తు తెలుసుకుని, తన ఇష్టానుసారంగా ప్రవర్తించిందే కాని, మానవ సంఘ రీతులకూ, మర్యాదలకూ అనుగుణంగా నడుచుకోలేకపోయింది. ఎప్పుడైతే పుష్పశరుడు తమ ధర్మాల మధ్య వున్న వైరుధ్యం స్వతస్సిద్ధం అనిగ్రహించాడో, అప్పుడే అతడికి తను ప్రియవాదికతో కలకాలం కాపురం చేయలేనన్న కఠోరసత్యం తెలిసి వచ్చింది. అందువల్లనే అతడు, తనను విడిచిపోతున్న ప్రియవాదికను ఆనడానికి పయత్నంచేయలేదు,," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: రామవరపు గణేశ్వరరావు రచన]





# యోగి సలహా

గోపయ్య అనే యువకుడికి జమీందారు గారి దివాణంలో చిన్న ఉద్యోగం దొరికింది. దానితో వాడికి పెళ్ళి సంబంధాలు రావడం, కమల అనే కాస్త కలవారి ఇంటి పిల్లను పెళ్ళాడటం జరిగిపోయింది.

కమల కాపురానికి వస్తూనే, ఆస్థిపరులైన పొరుగిళ్ళ ఆడవాళ్ళను చూసి, వాళ్ళలాగే తనకూ నగలూ, ఖరీదైన చీరలూ కావాలంటూ గోపయ్య మీద పోరు ప్రారంభించింది.

ఇంట్లోని పోరుతో విసుగెత్తిపోతున్న గోపయ్య, దివాణం పనుల్లో శ్రద్ధ చూపక పోవడంతో అతణ్ణి పనిలో నుంచి తీసేశారు. దానితో వాడికి జీవితం మీదే రోత పుట్టింది.

ఈ స్థితిలో వాడున్న గ్రామానికి సచ్చిదానందుడనే యోగి వచ్చాడు.

గోపయ్య ఒక సాయంకాలం వేళ యోగిని దర్శించి, "స్వామీ! నా భార్య పరమ గయ్యాళి. ఈ జీవితంతో విసిగి వేసారి పోయాను. తమరు యోగసిద్ధులు అని విన్నాను. నాకు వేరే జన్మ ప్రసాదించండి. నన్ను మనిషిగా మాత్రం మళ్ళీ పుట్టించకండి!" అన్నాడు.

అందుకు యోగి చిన్నగా నవ్వి, "ఇంతకూ నీ జీవిత శేషం ఎలా గడపదలుచుకున్నావు, నాయనా?" అని అడిగాడు. గోపయ్య జవాబివ్వబోయేంతలో, గాలి తాకిడికి యోగీ, వాడూ కూర్చున్న చోటున వున్న పొగడ చెట్టు కొన్ని పువ్వుల్ని వాళ్ళిద్దరి మీదా రాల్చింది.

గోపయ్య సువాసనలు వెదజల్లుతున్న పూలకేసి చూస్తూ, తను పువ్వుగా పుట్టాలని వున్నదన్నాడు. యోగి వాణ్ణి కళ్ళు మూసుకోమని, వాడి నుదుటి మీద వేళ్ళతో రాశాడు. గోపయ్య పువ్వుగా పుట్టాడు. వాడిలో క్షణం పాటు ప్రాణానికి ఎంతో హాయిగా వున్నట్టనిపించింది. కాని, అంతలోనే వాడిని భయం పట్టుకున్నది. తను వున్న చెట్టుకు నీరు అందకపోతే? ఏ ఆడపిల్లో వచ్చి తనను

"సత్య"

కోసి,గొంతుకుదారం బిగించి మాలగా మార్చి, మర్నాడు వాడిపోగానే చీపురుతో వీధిలోకి తుడిచిపారేస్తే?

వాడు వణికిపోతూ కెవ్వుమని అరిచి కళ్ళు తెరిచే సమయంలో, పక్కన వున్న చెట్టు కొమ్మ మీద వున్న పావురం ఒకటి రెక్కలను టపటపలాడించడం వినిపించింది.

వాడు వెంటనే యోగితో, "స్వామీ! నన్ను పువ్వుగా పుట్టించవద్దు; పక్షి జన్మ ప్రసాదించండి!" అన్నాడు.

"తథాస్తు!" అన్నాడు యోగి.

మరుక్షణం గోపయ్య పావురంగా మారి దూరంగా ఎగిరిపోయి, ఒక చెట్టు కొమ్మమీద వాలాడు.ఆసమయంలోఅటుగావచ్చిన బోయ వాడొకడు, వాడిమీద బాణంవదిలాడు. బాణం గురి తప్పి పక్క కొమ్మకు తగిలింది.గోపయ్య ఈసారి మరింత పెద్దగా అరిచి యోగితో, "స్వామీ! ఈ పక్షి జన్మ నాకొద్దు. ఇది ప్రమాదాల పుట్ట. ఏ మేకగానో, గొర్రెగానో పుట్టించండి. హాయిగా పచ్చిక బయళ్ళలో మేస్తూ, ఆనందంగా జీవితం గడిపేస్తాను," అన్నాడు.

యోగి మృదువుగా గోపయ్య భుజం తట్టి, "నాయనా! మేకా లేక గొర్రె రూపంలో వున్న నిన్ను కటిక వాళ్ళు సుఖంగా బ్రతకనిస్తారా?" అన్నాడు.

అది వింటూనే గోపయ్య, యోగి కాళ్ళ మీదపడి, "స్వామీ! నన్ను నన్నుగానే వుండనీయండి," అన్నాడు.

యోగి తృప్తిగా తలాడించి, "నాయనా! నేను నిన్ను పువ్వుగానూ మార్చలేదు, పావురంగానూ మార్చలేదు. అలా మార్చే శక్తి నాకు లేదు. అయితే, ఆయా జన్మల అనుభూతి మాత్రం ఒక క్షణ కాలం నీకు కలిగేలా చేశాను. ఇక నుంచయినా జీవితాన్ని గురించి వాస్తవ దృష్టి అలవరుచుకో. పట్టుదలతో సామదానోపాయాలను ఉపయోగిస్తే, నీ భార్య గయ్యాళితనాన్ని సరిదిద్ద వచ్చు. అలాగే ఎక్కడైనా ఉద్యోగం కూడా నిజాయితీగా, తగినంత శ్రద్ధతో చేస్తే ఎంత కాలమైనా నిలుపుకోవచ్చు!" అని సలహా ఇచ్చాడు.

గోపయ్యయోగికిసాష్టాంగనమస్కారం చేసి, తృప్తి చెందిన మనస్సుతో ఇంటి దారిపట్టాడు.



# బొంబాయి పరిసరాలు

రచన : మీరానాయర్

చిత్రాలు : గౌతమ్ సేన్


గ్రేట్ బ్రిటన్‌కు చెందిన రెండవ ఛార్లెస్


పోర్చుగీసు యువ రాణి కేథరిన్ డా బ్రాగాంజా

ఐదు శతాబ్దాలకు పూర్వం పోర్చుగీసులు భారతదేశానికి వచ్చినప్పుడు, ఈనాటి బొంబాయి నగరం ఏడు దీవుల మీద చిన్న చిన్న పల్లెకారుల గ్రామాలుగా ఉండేది. వీటిలో ముంబయ్ అనే ఒక దీవిని–పోర్చుగీసు యువరాణి కాథరిన్ డా బ్రాగాంజాను ఇంగ్లాండు రెండవ చార్లెస్ వివాహమాడినప్పుడు ఆయనకు పోర్చుగీసులు కానుకగా ఇచ్చారు. ఉత్తరోత్తరా మిగిలిన ఆరు దీవులను కూడా పోర్చుగీసులు ఆంగ్లేయులకు వదులుకున్నారు. కాల క్రమేణా వంతెనల ద్వారా ఏడు దీవులూ ఒకటిగా కలుపబడ్డాయి. ఈనాడు ఎంతో అభివృద్ధిచెంది, బొంబాయి మహానగరం మనదేశానికి వ్యాపార రాజధానిగా వెలుగొందుతున్నది.


బొంబాయి ఏడు దీవులు

బొంబాయికి 64 కి.మీ. పొడవు గల సముద్ర తీర రేఖ ఉన్నది. దానికి వాయవ్య దిశగా వెర్సోవా అనే పల్లెకారుల గ్రామం ఉన్నది. స్థానికులయిన కోలీలు ఇక్కడ అధిక సంఖ్యలో నివసిస్తున్నారు. మగవాళ్ళు సముద్రంలోకి వెళ్ళి చేపలు పట్టుకుని వస్తే, ఆడవాళ్ళు చేపలను పడవల నుంచి దించడానికీ, వాటిని మార్కెట్లో అమ్మడానికీ సహాయపడతారు. కోలీలు పట్టి తెచ్చే 'బాంబిల్' 'బొంబేడక్' అనే చేపలకు నగరవాసులలో మంచి గిరాకీ ఉన్నది.

వెర్సోవాకు రెండు కి.మీ. దూరంలో జూహూ అనే సుప్రసిద్ధమైన సముద్ర తీరం ఉన్నది. జూహూ బీచ్ రకరకాల దుకాణాలతో నిండి ఉన్నది. ముఖ్యంగా బొంబాయికి చెందిన 'భేల్ పూరీ' వంటి అత్యంత రుచికరమైన తినుబండారాలను ఇక్కడ విక్రయిస్తారు.

1932వ సం॥లో జె.ఆర్.డి. టాటా పస్‌మోత్ అనే విమానంలో జూహూలో


టాటా విమానయాన చరిత్ర సృష్టించిన ది పస్‌మోత్


జె.ఆర్.డి. టాటా

దిగి మనదేశ విమానయాన చరిత్రను సృష్టించాడు. మన జాతీయ విమానయాన సంస్థ 'ఎయిర్ ఇండియా' ఆవిర్భవానికి ఇది నాంది పలికింది.



మౌంట్ మేరీ ఆలయం

ఈ సముద్రతీరంలో మరికొంత దక్షిణంగా, బాంద్రా కొండ శిఖరం మీద మౌంట్‌మేరీ ఆలయం ఉన్నది. 1640వ సం॥లో పోర్చుగీసులు దీనిని నిర్మించారు. యేటా సెప్టెంబర్ నెలలో జరిగే ఉత్సవాల సమయంలో పలు మతాలకు చెందిన ప్రజలు ఇక్కడికి వచ్చి మేరీమాతకు కొవ్వొత్తులు వెలిగిస్తారు.

సముద్రం లోపల వోర్లీ ద్వీపంలో, ఎనిమిది శతాబ్దాలకు ముందు నిర్మించిన హాజీ అలీ దర్గా ఉన్నది. సముద్రంలో అలలు తక్కువగా ఉన్నప్పుడే అక్కడికి చేరడానికి వీలవుతుంది. అక్కడ పీర్ హాజీ అలీ హజ్రత్ బుఖారీ సమాధి ఉన్నది. ఒకప్పుడు సంపన్న వర్తకుడయిన హాజీ అలీ, మెక్కా హజ్ యాత్రకు బయలుదేరేముందు తన సంపదనంతా పేదసాదలకు దానం చేసేశాడని చెబుతారు. ఆయన మెక్కానుంచి తిరిగి వచ్చాక ఈ దీవిలోని ఒక బండ మీద నివసిస్తూ ఆధ్యాత్మిక జీవితాన్ని కొనసాగించాడు. ఆయన మరణానంతరం, ఆయన అనుచరులు స్మారక చిహ్నన్ని నిర్మించి దానికి హాజీ అలీ దర్గా అని పేరు పెట్టారు,

హాజీ అలీ దర్గా



జూహూ బీచ్ లాగానే, మలబార్ హిల్ దిగువన ఉన్న చౌపట్టీ బీచ్ కూడా విమానయానంతో సంబంధం కలిగి ఉన్నది. సరిగ్గా వంద సంవత్సరాలకు పూర్వం శివకర్ బాపూజీ తాల్పేడ్ అనే ఒక వేద పండితుడు ఈ తీరం మీద విమానం నడిపాడని చెబుతారు. 'రైట్‌బ్రదర్స్' విమానం నడిపి చరిత్ర సృష్టించిన దానికి ఎనిమిది సంవత్సరాలకు పూర్వం ఇది జరిగినట్టు చెబుతారు.

చౌపట్టీ బీచ్, బొంబాయిలోని మిగతా బీచ్‌లలాగే యేటా గణేశ చతుర్థి ఉత్సవసమయంలో మరింత సందడిని పుంజుకుంటుంది. చిన్నా, పెద్ద గణేశ విగ్రహాలను సముద్రంలో నిమజ్జనం చేస్తారు. బాల గంగాధర తిలక్ ఈ ఉత్సవాలకు

నిమజ్జనం కోసం ఊరేగింపుగా తీసుకువెళుతున్న గణేశ విగ్రహం

మరింత ప్రాచుర్యం కలిగించాడు. చౌపట్టీ తీరంలోనే తిలక్‌ను దహనం చేశారు. అక్కడ ఆయన కాంస్య విగ్రహం ప్రతిష్ఠించబడి ఉన్నది.

మనదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో బొంబాయికి సమున్నత స్థానం ఉన్నది. ఇక్కడే భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవించింది. 1942 వ సం॥ ఆగస్టు 8వ తేదీ కాంగ్రెస్ ఇక్కడే 'క్విట్ ఇండియా' తీర్మానం చేసింది.

మనదేశంలో మొట్టమొదటిది బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజ్, 1850 వ సం॥లో ఒక మర్రిచెట్టు కింద కూర్చుని వ్యాపారం చేసే ఆరుగురు బ్రోకర్లతో ఇది ప్రారంభమయింది. 1877 వ సం॥ లో దలాల్ వీధిలో బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజ్ స్థాపించబడింది. ఇప్పటి స్టాక్ ఎక్స్ఛేంజ్ భవనం వంద సంవత్సరాల తరవాత నిర్మించబడింది.

ఇవాళ మనదేశంలోని అతి పెద్ద ఓడరేవు బొంబాయిలోనే ఉన్నది. ఇది ఎప్పుడూ, రద్దీగా హడావుడిగా ఉంటుంది. 1870 -- 1970 మధ్య కాలంలో విక్టోరియా డాక్సులో ససూన్, ప్రిన్సెస్, అలెగ్జాండ్రియా, ఇందిరా డాక్స్ నిర్మాణం జరిగాయి. బొంబాయి ఓడరేవుకు అనుబంధంగా దానికి 11 కి.మీ. దూరంలో నావా-షేవా దీవుల మీద జవహర్‌లాల్ నెహ్రూ పోర్ట్ నిర్మితమై ఉన్నది.

1944 వ సం॥ ఏప్రిల్ 14వ తేదీ మధ్యాహ్నం పన్నెండున్నర గంటలకు విక్టోరియా డాక్సులో పని చేస్తూన్న కార్మికులు కొందరు — బ్రిటిష్ నౌకా దళానికి చెందిన ఎస్. ఎస్. ఫోర్ట్‌స్టికైన్ అనే ఓడ నుంచి పొగలు రావడం చూశారు. అది కరాచీ నుంచి రకరకాల వస్తువులూ, కోట్లాది విలువ చేసే బంగారంతో పాటు ఆయుధ సామగ్రిని కూడా తీసుకు వచ్చింది. ఆ తరవాత వెలువడిన ప్రేలుడు శబ్దానికి నగరం దద్దరిల్లింది. రేవులో లంగరు దించిన 54 ఓడలకు నిప్పంటుకున్నది. ఆ రోజంతా ప్రేలుళ్ళధ్వనులు 8 — 10 కి.మీ. దూరం వరకు వినిపించసాగాయి. నగరంలో అక్కడక్కడా బంగారపు కడ్డీలు చెల్లాచెదురుగా పడ్డాయి. రెండు డజన్ల ఇంజనులతో మంటలను ఆర్పారు. ఆ ప్రమాదం వల్ల ఏర్పడిన శిథిలాలను తొలగించడానికి పదివేల మంది సిబ్బందికి ఆరు నెలలు పట్టింది.

మన దేశంలో బొంబాయి నగరాన్ని వివిధ వేష భాషలకూ, సంస్కృతులకూ నిలయమైన కాస్మోపాలిటన్ నగరంగా చెప్పవచ్చు. మహారాష్ట్రులతో పాటు, మనదేశంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన వారూ, ఇంకా విదేశాల నుంచి వచ్చిన వారూ ఇక్కడ నివసిస్తున్నారు. మజగాన్‌లో ఫెర్రీ వార్ఫ్ సమీపంలో 180 సంవత్సరాల నాటి క్యాంగ్



బొంబాయిలోని భిన్న సంస్కృతుల సమాజం

కుంగ్ ఆలయం ఉన్నది. ఇది బొంబాయిలో నివసిస్తున్న 3,000 పైచిలుకు చైనా దేశస్థులకు కూడలి స్థానంగా ఉంటున్నది. ఈ నగరంలో జపాను వారికి చెందిన ఒక ఆలయం, యూదుల మందిరం ఒకటీ ఉన్నాయి.



మహారాష్ట్ర రాజధాని అయిన బొంబాయి నగరాన్ని మన దేశంలో చలనచిత్రాల నిర్మాణానికి కూడా రాజధాని అని చెప్పవచ్చు. అందుకే దీనిని 'ఇండియాస్ హాలీవుడ్' అని అంటారు. మనదేశంలో ప్రప్రథమంగా అంటే 1896 జూలై 7వ తేదీ ఇక్కడి వాట్సన్ హొటెల్ (ఇప్పటి ఎస్ప్లనేడ్ భవనంలో ఉన్నది)లో సినిమా చూపబడింది. బొంబాయి శివార్లలోని గోర్గాన్‌లో నెలకొల్పిన ఫిల్మ్‌సిటీలో యేటా వందలాది చిత్రాలు నిర్మిస్తున్నారు.



400 యేళ్ళనాటి సన్‌డయల్

భారత దేశపు సింహద్వారం అని పేరు గాంచిన గేట్‌వేకు సమీపంలోని, ఐ.ఎన్.స్. ఆంగ్రే నౌకాదళ ప్రాంగణంలో 400 సంవత్సరాలనాటి బ్రహ్మాండమైన సన్‌డయల్ (గడియారం) ఉన్నది. మూడు మీటర్ల ఎత్తున్న ఈ 'సన్‌డయల్' చుట్టూ మనుషుల తలలూ, వింత ప్రాణుల రూపాలూ చెక్కబడి ఉన్నాయి. రేవులో ప్రవేశించే ఓడలకు సమయం తెలియడంకోసం సముద్రానికి అభిముఖంగా పోర్చుగీసులు ఈ గడియారాన్ని రూపొందించారు.

బొంబాయిలోని అతి ముఖ్యమైన చిహ్నం గేట్ వే ఆఫ్ ఇండియా అని ప్రసిద్ధిగాంచిన రాతి సింహద్వారం. అరేబియా సముద్రానికి అభిముఖంగా ఎంతో గంభీరంగా కనిపించే శిలాద్వార తోరణం ఇది. దీనిని 1927వ సం॥లో నిర్మించారు. ఆ స్థానంలో అంతకుముందు, ఇంగ్లాండు కింగ్ జార్జ్‌కీ, క్వీన్ మేరీకి స్వాగతం పలకడానికి 1911వ సం॥లో హడావుడిగా నిర్మించిన తెల్లటి ద్వారం ఉండేది.

మన దేశం స్వాతంత్ర్యం పొందిన తరవాత, స్వదేశానికి తిరిగి వెళుతున్న బ్రిటిష్ సైనికులకు, ఈ 'గేట్‌వే ఆఫ్ ఇండియా' గుండా వీడ్కోలు పలికిన విషయం, ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషం!



భారతదేశ సింహద్వారం



# వెయ్యి రూపాయల చొక్కా

బ్రహ్మయ్య, భోగన్న పోలవరంలో వుంటున్నారు. ఇద్దరూ కాయకష్టం చేసేవారు. కొన్నాళ్ళకు పోలవరంలో కరువొచ్చింది. బ్రహ్మయ్యకూ, భోగన్నకూ పనిలేకుండా పోయింది. బ్రతుకుతెరువు వెతుక్కుంటూ ఇద్దరూ పట్నం వెళ్ళారు. అక్కడ అన్నీ కలిసి రావడంతో, ఏడాదితిరక్కుండాబోలెడుడబ్బుకూడ బెట్టారు.

అప్పుడు భోగన్నకు పోలవరం వెళ్ళి తన వైభవం చూపించుకోవాలనిపించింది. బ్రహ్మయ్యనడిగితే సరేనన్నాడు.

“ఊరికి ఉత్త చేతులతో ఏం వెడతాం? తెలిసిన వాళ్ళకు కానుకలు తీసుకుని వెళితే బాగుంటుంది,” అన్నాడు బ్రహ్మయ్య.

ఇందుకు భోగన్న సరేనన్నాడు. ఇద్దరూ కలిసి పట్నంలో సంతకు వెళ్ళారు.

బ్రహ్మయ్యకు పోలవరంలో పది మంది స్నేహితులున్నారు. వాళ్ళకోసం వాడు పదిరకాల వస్తువులు కొన్నాడు. వందరూపాయలు ఖర్చయింది. భోగన్న మాత్రం అవేమీ కొనకుండా, “నువ్వు చాలా చిన్న వస్తువులు కొన్నావు. పట్నంలో మన హోదా ఏమిటో వాళ్ళకు తెలియాలంటే, ఖరీదైన వస్తువులు కొనాలి,” అన్నాడు బ్రహ్మయ్యతో.

“నేను కొన్న వస్తువులు నా హోదానూ, తాహతునూ తెలియజేస్తాయి. ఇంతకంటే ఎక్కువ ఖరీదువి నేను కొనలేను,” అన్నాడు బ్రహ్మయ్య నిర్మొహమాటంగా.

మిత్రులిద్దరూ సంతలో కాసేపు తిరిగాక, ఒకచోట వ్యాపారి ఒకడు, “అయ్యో, ఇంత పెద్ద పట్నంలో నా దగ్గర సరుకు కొనే ధనవంతుడే లేడా?” అంటూ అరుస్తున్నాడు.

భోగన్న, వ్యాపారిని పలకరించి సరుకు చూపించమన్నాడు.

వ్యాపారి చొక్కా ఒకటి చూపించి, “ఈ గుడ్డ చీనా దేశం నుంచి వచ్చింది. ముట్టుకుంటే చాలు పట్టు పరుపులను తాకినట్లే వుంటుంది.

జొన్నలగడ్డ రామలక్ష్మి



భోగన్న తన వద్ద వున్న డబ్బు లెక్కపెడితే, తొమ్మిది వందలుంది. బ్రహ్మయ్య దగ్గర వందరూపాయలు అప్పు తీసుకుని, భోగన్న ఆ చొక్కా కొనేశాడు.

"ఇంత ఖరీదైనచొక్కా ఎవరికోసం? పోల వరం గ్రామాధికారికి గానీ ఇద్దామనుకుంటు న్నావా? ఆయన మనకెప్పుడైనా ఉపకారం చేశాడా ఏమన్నానా? ఇంకెవరికిద్దామనుకున్నా, ఇది తొడిగే తాహతు ఎవరికుంది?" అంటూ అడిగాడు బ్రహ్మయ్య ఆశ్చర్యం పట్టలేక.

భోగన్న చిన్నగా నవ్వి, "ఇంకొకరి కోసం వెయ్యి రూపాయలు ఖర్చు పెట్టే వెర్రి వాణ్ణి కాను, ఈ చొక్కా కోసం! మన ఊళ్ళో ఈ చొక్కా వేసుకుని తిరిగానంటే, ఊరు ఊరంతా నా హెూదాను తల్చుకుని విస్తుపోతుంది," అన్నాడు.

"అందుకని ఒక్క చొక్కా కోసం వెయ్యి రూపాయలు తగలేస్తావా? ఇది తొడుక్కుంటే నీకేం సంతోషం? అంత డబ్బు పోయిందన్న బాధను గుర్తు చేయడానికే పనికొస్తుందిది," అన్నాడు బ్రహ్మయ్య.

"బ్రహ్మయ్యా! నీకు సుఖపడడం తెలియ దురా. ఎదుటి వాడికోసం ఎంత ఖర్చుపెట్టినా వాడికి తృప్తి వుండదు, నీకు గౌరవం లభిం చదు. నీకోసం నువ్వు డబ్బు ఖర్చు పెట్టు కుంటే, నీహెూదా పెరుగుతుంది. అంతా నిన్ను గౌరవిస్తారు. ఇది గుర్తుంచుకో. సుఖ పడతావు," అంటూ భోగన్న, బ్రహ్మయ్యకు

దీనిని అరబ్బు దేశపు దర్జీ ఎంతో చాతుర్యంతో చొక్కాగా కుట్టాడు. దీని మీద వున్న పూల బొమ్మలన్నీ వెండి బంగారు దారాలతో కుట్ట బడ్డాయి. అక్కడక్కడ ముత్యాలు పొదిగిన ఈ చొక్కా, పదివేల రూపాయల విలువ చేస్తుంది.నేను వెయ్యి రూపాయలకు అమ్ము తున్నాను!" అన్నాడు.

"చొక్కా వెయ్యి రూపాయలా? తీరుబడిగా కూర్చునేమహారాజులకో,జమీందార్లకోచూపించు. ఇలాంటివి సంతకు తీసుకురాకు," అన్నాడు బ్రహ్మయ్య.

అయితే, భోగన్న మాత్రం వెంటనే ఆ చొక్కాను బేరమాడాడు. వెయ్యి రూపాయలకు ఒక్క పైస కూడా తగ్గనన్నాడు వ్యాపారి.

నీతిబోధ చేశాడు. ఏది ఏమైతేనేం—అనుకున్న రోజుకు మిత్రు లిద్దరూ పోలవరానికి బయ ల్దేరారు. ఊళ్ళో ప్రవేశించే ముందు పొలిమేర లోని చెరువు దగ్గర ఆగిపోయాడు భోగన్న. అక్కడ స్నానం చేసివెయ్యిరూపాయల చొక్కా ధరించి, అప్పుడు ఊళ్ళో ప్రవేశిస్తానన్నాడు వాడు.

బ్రహ్మయ్య మాత్రం వెంటనే ఊళ్ళోకి పోయి, తనకు తెలిసిన వాళ్ళను కలుసుకుని పట్నంనుంచి తెచ్చిన కానుకలిచ్చాడు. అంతా వాణ్ణి బాగా ఆదరించి భోగన్న గురించి అడి గారు.

"భోగన్నకేం—మన ఊళ్ళో వేసుకు తిరగడా నికి వాడు వెయ్యి రూపాయల చొక్కాకొన్నాడు, తెలుసా?" అన్నాడు బ్రహ్మయ్య.

భోగన్న వెనకాలేవస్తున్నాడని తెలిసి కొందరు వాణ్ణి చూడ్డానికి ఊరి పొలిమేర దాకా వెళ్ళారు. అప్పటికి వాడి స్నానం పూర్తయింది. కొత్త చొక్కా వేసుకున్నాడు.

ఊళ్ళోవాళ్ళుభోగన్ననుచుట్టుముట్టి, "నువ్వు వెయ్యి రూపాయలచొక్కాకొన్నావని బ్రహ్మయ్య చెప్పాడు. అంత ఖరీదైన చొక్కా ఎలా ఉం టుందోచూడాలనుంది. ఒక్కసారి చూపించు," అన్నారు.

భోగన్న చిన్న బుచ్చుకుని, "చూస్తే తెలి యడంలేదూ? ఇప్పుడు నేను వేసుకున్న చొక్కా అదే!" అన్నాడు.

ఊళ్ళో వాళ్ళు చొక్కాను దగ్గర నుంచి పరీక్షగా చూశారు. వాళ్ళల్లో ఒకడు, "పట్నంలో మోసగాళ్ళెక్కువని విన్నాను. ఈచొక్కా వెయ్యి





రూపాయలా? చూడ్డానికి చాలా మామూలుగా వుంది. భోగన్నా! నువ్వు అబద్ధం చెబుతున్నా నను, సంతోషిస్తాను. ఈచొక్కా కోసం మనూరి వాడు వెయ్యి రూపాయలు పోగొట్టుకున్నా డంటే భరించలేను," అన్నాడు.

భోగన్న కాస్త బాధపడుతూనే, చొక్కాకున్న వెండి బంగారు దారాల గురించీ, ముత్యాల గురించీ చెబితే, ఊరివాడు, నమ్మలేనన్నట్టు ముఖం పెట్టి, "ఏమో — ఇవి చూడ్డానికి తెలుపు, పసుపు దారాల్లా వున్నాయి. నువ్వు ముత్యాలంటున్నవి గాజు పూసల్లా వున్నాయి. అవి నిజంగా వెండి బంగారు దారాలూ, ముత్యాలూ అయితే మాత్రం ఏం లాభం? చెపితే తప్ప ఎవరికీ తెలియవు. ఇలాంటి చొక్కాను వందరూపాయలతో తయారు చేసుకోవచ్చు. ఇప్పుడైనా ఒప్పుకో — నువ్వు మాతో అబద్ధం చెబుతున్నావు కదూ!" అన్నాడు.

అప్పుడు భోగన్న వాళ్ళతో కలిసి ఊళ్ళోకి వెళ్ళి, బ్రహ్మయ్యను సాక్ష్యం చెప్పమన్నాడు. బ్రహ్మయ్య ఆ చొక్కా ధర వెయ్యి రూపాయ లని చెప్పగానే అందరూ, "అయితే నువ్వు పక్కనే వుండి భోగన్న నష్టపోయేలా చేశావన్న మాట! ఒకే ఊరివాళ్ళు ఇలాగేనా వుండడం? పట్నం వెళ్ళాక మీరిద్దరూ బాగా మారిపోయి నట్టున్నారు. ఇక్కడున్న మా కోసం కానుకలు తెచ్చిన వాడివి, అక్కడ నీతో పాటున్న మిత్రుడు కళ్ళెదుట మోసపోతూంటే చూస్తూ వూరుకున్నావా?" అంటూ బ్రహ్మయ్యను తప్పుపట్టారు.

అందులో బ్రహ్మయ్య తప్పులేదనీ, తనుకా వాలనే ఆ చొక్కా కొనుక్కున్నాననీ వాళ్ళకు భోగన్న చెప్పి, "మీకు ముందుగా బ్రహ్మయ్య ద్వారా తెలియడంవల్ల, చొక్కా గురించి ఏమేమో ఊహించుకున్నారు. అసలు చొక్కా చూశాక నిరుత్సాహపడ్డారు. ఏమీ తెలియని వాళ్ళు, ఈ చొక్కాను చూస్తే మూర్ఛపోయినంత పనిచేస్తారు," అన్నాడు.

భోగన్న తన చొక్కాతో ఊరంతా తిరిగి ఎందర్నో కలుసుకుని వచ్చాడు. కొందరు వాడి చెప్పుల గురించి అడిగారు. కొందరు వాడి చేతిలో వున్న పొన్నుకర్ర గురించి అడి

గారు. కొందరు పట్నం వెళ్ళాక వాడి నడక మారిందన్నారు. కొందరు వాడి మీసాలు, జమీందారు గారి పెద్ద కొడుకు మీసాలతో సరిపోలగలవన్నారు. అయితే, ఒక్కరూ చొక్కా గురించి అడగలేదు. నోరువిడిచి వాడు కొందర్ని చొక్కా ఎలా వుందని అడిగితే—ఫర్వాలేదు బాగానే వుంది, అని చెప్పి ఊరుకున్నారు.

ఊళ్ళో రెండు రోజులుండి మిత్రులిద్దరూ తిరుగు ప్రయాణమయ్యారు. ఇద్దరికీ తెలిసిన వాళ్ళు కొందరు, భోగన్నకొకకంట కనిపెడుతూ సలహాలివ్వమని బ్రహ్మయ్యకు చెప్పి, భోగన్నతో, "ఒరేయ్! సంపాదించిన డబ్బును వృధా చేసుకోకు. బ్రహ్మయ్య తెలివైనవాడు. వాడి సలహాలు తీసుకుని బాగుపడు!" అని హితవు చెప్పారు.

పట్నం వెళ్ళే దారిలో భోగన్న, "మన ఊరి వాళ్ళు స్వార్థపరులు. నువ్వు వాళ్ళకోసం కానుకలు తెచ్చావు కదా — నిన్ను పొగిడారు. నేను నాగురించే ఖర్చుపెట్టుకున్నాను కదా-అందుకని నన్ను ఎంతగానో చిన్నబుచ్చారు. మళ్ళీ ఈ ఊళ్ళో అడుగుపెట్టను," అన్నాడు బ్రహ్మయ్యతో.

బ్రహ్మయ్య నవ్వి, "నీ గురించి నీకే తెలియని వాడివి, మనూరి వాళ్ళనేంఅర్థం చేసుకుంటావు? నువ్వు వెయ్యిరూపాయల చొక్కా నీకోసం కొనుక్కున్నావా? ఇతరుల మెప్పుకోసం కొన్నావు. నీకోసమే కొనుక్కుంటే అది తొడుక్కుని సంతోషించే వాడివి. ఇతరులు దాని విలువ గుర్తించకపోతే, నీకు చిన్నతనమనిపించింది. ఇతరుల మెప్పుకోసం, నీవంటిమీదుండే చొక్కాకు వెయ్యిరూపాయలు ఖర్చు చేసే బదులు, ఇతరులకోసమే ఒక పది రూపాయలు ఖర్చుచేస్తే నీవు కోరిన మెప్పు చౌకగా లభించేదికదా! ఆలోచించు. ఇతరుల కోసం ఏమీ చేయకుండా, వాళ్ళను స్వార్థపరులనడం న్యాయమా?" అన్నాడు.

భోగన్నకు తన తప్పు అర్థమయింది. అప్పటి నుంచీ వాడు లేనిపోని భేషజాలను పూర్తిగా విడిచి పెట్టి, తన మిత్రుల కోసం కూడా జీవించడం నేర్చుకుని సంతోషంగా వున్నాడు.






# పందెం వద్దు!

పూర్వం కమలాపుర రాజ్యాన్ని పాలించిన కమలధ్వజుడికి శూరధ్వజుడు అనే కొడుకూ, శాలిని అనే కుమార్తే ఉండేవారు. శూరధ్వజుడు పేరుకు తగినట్టు మహాశూరుడు. అతను అన్ని వీరవిద్యలూ అభ్యసించి ప్రవీణుడయ్యాడు. అనేక యుద్ధాలలో ముందు నిలిచి పోరాడి ఘన విజయం పొందాడు. అతను ఓటమి అన్నది ఎప్పుడూ ఎరగడు. అతని పేరంటే శత్రువులకు సింహస్వప్నంగా ఉండేది.

కమలధ్వజుడు శూరధ్వజుణ్ణి యువరాజుగా అభిషేకించి, తాను పేరుకు మాత్రమే రాజుగా ఉంటూ, రాజ్యభారమంతా కొడుకుకే వదిలేశాడు. ఇలాఉండగా శాలిని యుక్త వయస్కురాలయింది. రాజు ఆమె కోసం తగిన వరుణ్ణి వెతికే ఆలోచనలో పడ్డాడు. ఈ సంగతి తెలిసి శూరధ్వజుడు, "నా చెల్లెలిని మహావీరుడికి తప్ప ఇవ్వగూడదు. నన్ను గెలిచినవాడికే ఆమె నిచ్చి పెళ్ళిచేద్దాం," అన్నాడు తండ్రితో.

"నీ ఆలోచన బాగానే ఉన్నది, కాని పోటీ నీతో కాకుండా మరొక వీరుడితో ఏర్పాటు చేద్దాం," అన్నాడు రాజు.

ఇందుకు శూరధ్వజుడు ఒప్పుకోక, శాలినిని పెళ్ళాడేవాడు తననే జయించాలని పట్టుబట్టాడు. ఆ విధంగా అతను ప్రకటన కూడా చేయించాడు.

కొంతకాలంపాటు రాజకుమారు లెవరూ ముందుకు రాలేదు. శూరధ్వజుణ్ణి జయించ గలమన్న నమ్మకం వారికి లేకపోయింది. కాని చివరకు, శ్యామలదేశపు రాజకుమారుడు వాయువర్మ అనేవాడు, శూరధ్వజుణ్ణి జయించి శాలినిని పెళ్ళాడతానని వచ్చాడు.

వాయువర్మ అన్నివిధాలా శాలినికి తగిన వరుడని రాజుకు తోచింది. శాలిని కూడా అతన్ని తన భర్తగా వరించటానికి సిద్ధపడింది.

అయితే, ముందుగా వాయువర్మ శూరధ్వజుడి తోపోటీ చేసి గెలవవలసి ఉన్నది. ఆ పోటీకి ఒక మంచి రోజు నిర్ణయించి, వాయువర్మకు రాజభవనంలోనే బస ఏర్పాటు చేశారు.

అయితే, రేపు పోటీ అనగా ఒక దుర్ఘటన జరిగింది. రాజకుమారి శాలిని ఉద్యానంలో ఉండగా కొందరు దుర్మార్గులు, ఆమెను బంధించి, ఎత్తుకుపోయారు.

శూరధ్వజుడు వాయువర్మను పిలిపించి, "నా చెల్లెలిని ఎవరో దుర్మార్గులు ఎత్తుకుపోయారు. ఆమెను వెతికి తీసుకురావటానికి పోతున్నాను. మన పందెం మాట తరవాత చూసుకుందాం," అన్నాడు.

"ఆమెను వెతకటానికి నేను కూడా వస్తాను. ఆ దుర్మార్గుల నెత్తురు కళ్ళ చూడవలసిందే!" అన్నాడు వాయువర్మ.

ఇద్దరూ ఆయుధాలు ధరించి బయలు దేరారు. వారు మొదట ఉద్యానానికి వెళ్ళారు. అక్కడ పరిశోధించగా, శాలినిని దుర్మార్గులు ఎటుగా తీసుకుపోయినదీ తెలిసిపోయింది. బుద్ధిశాలి అయిన శాలిని తాను పోగు చేసిన పూలను దారివెంట వేసింది. ఆ పూలు కనిపించిన దారినే శూరధ్వజుడూ, వాయువర్మా వెళ్ళి, నగరానికి చాలా దూరంగా ఒక చెట్టు కింద కూర్చుని ఉన్న ఒక యోగిని చేరారు.

యోగిని దాటినాక పూలజాడ కానరాలేదు. ఒకవేళ శాలిని వద్ద ఉన్న పూలు అయిపోయి ఉండవచ్చు. అందుచేత యువకులిద్దరూ



యోగివద్దకు తిరిగివచ్చి, "అయ్యా, ఇటుగా ఎవరైనా ఒక స్త్రీని బలాత్కారంగా తీసుకు వచ్చారా!" అని అడిగారు.

"అవును, నలుగురు బలాఢ్యులు ఒక స్త్రీని మోసుకురావటం చూశాను. నేను వాళ్ళకు బుద్ధి చెప్పాను గాని, వాళ్ళు నామాటలు లక్ష్యపెట్టక, ఇలా అరణ్యమార్గం పట్టివెళ్ళారు," అన్నాడు యోగి.

అడవిదారి తిన్నగా ఒక కొండగుహను చేరింది. గుహద్వారానికి కొంచెం లోపలగా పూలచెండు ఒకటి కనిపించింది.

"దుర్మార్గులు శాలినిని ఈ గుహలో దాచి ఉంచారు. నేను వెళ్ళి ఆమెను విడిపించుకు వస్తాను," అన్నాడు వాయువర్మ.

"అలా కాదు, నువ్వు ఇక్కడే ఉండు. నేనే ఆమెను విడిపించుకు వస్తాను," అంటూ శూరధ్వజుడు కత్తిదూసిగుహలోకి జొరబడ్డాడు.

అతను లోపలికి వెళ్ళిపోగానే ఒక పెద్ద కొండరాయి అతనికి వెనకగా పడి, గుహ ద్వారాన్ని మూసివేసింది.

గుహ వెలుపల ఉన్న వాయువర్మకు ఒక స్త్రీ ఆర్తనాదం వినపడింది. అతను ఆ నాదం వినపడిన దిక్కుగా వెళ్ళి, చెట్టుకు కట్టి ఉన్న శాలినినీ, ఆమెను బెదిరిస్తున్న నలుగురు బలాఢ్యులనూ చూశాడు. వారిలో ముఖ్యుడు లాగా ఉన్నవాడు శాలినితో, "వెర్రిదానా, నిన్ను రక్షించటానికి వచ్చిన వీరులను నా మనుషులు గుహలో బంధించారు. ఇక నువ్వు నన్ను పెళ్ళాడక తప్పదు. నిన్ను నా నుంచి రక్షించేవారెవరూ లేరు!" అంటున్నాడు.

వాయువర్మ కత్తి దూసి ఆ మాటలన్న వాడిపైన పడ్డాడు. ఆ దుర్మార్గులు నలుగురూ ఏకమై అతన్ని ఎదిరించారు. కొంతసేపు వారు ఆత్మరక్షణ మాత్రం చేసుకుని, అరణ్యంలోకి పారిపోయారు. వాయువర్మ శాలిని కట్లు విప్పి, ఆమెను వెంటబెట్టుకుని శూరధ్వజుడుబంధింపబడ్డ గుహ వద్దకు వచ్చాడు.

అదేసమయానికి అదృష్టవశాన అరణ్యవాసులు కొందరు అటుగావచ్చి, గుహద్వారానికి అడ్డంగా ఉన్నరాతిని తొలగించి, లోపల చిక్కుకుపోయిన శూరధ్వజుణ్ణి విడిపించారు.

తరవాత శూరధ్వజుడూ, వాయువర్మా, శాలినిని వెంటబెట్టుకుని రాజభవనానికి తిరిగి వచ్చారు. రాజు పురోహితుణ్ణి పిలిపించి, శాలినిని వాయువర్మకిచ్చి వివాహం చెయ్యటానికి ముహూర్తం నిర్ణయించమన్నాడు. "పోటీలో అతను నన్ను గెలిచిన తరవాత కదా వివాహం? శాలినినిదొంగలు ఎత్తుకుపోకపోతేఇవాళ మా పోటీ జరగవలసింది," అన్నాడు శూరధ్వజుడు.

"మీపోటీఇవాళజరిగింది. నన్ను విడిపించటానికి నీతో అతను పోటీ చేసి నెగ్గాడు. ఇక వేరే పోటీ అవసరం లేదు," అన్నది శాలిని.

శూరధ్వజుడు సిగ్గుపడి తల వంచుకున్నాడు. శాలినినిదొంగలుఎత్తుకుపోవటమంతా నాటకమనీ, రాజూ, శాలినీ కలిసి ఈ నాటకమంతా ఆడారనీ అతనికి తెలియదు.





నారదుడు వెళ్ళిన తరవాత ధర్మరాజు తన తమ్ములతోరాజసూయయాగంగురించిఆలోచించాడు. రాజసూయయాగం జయప్రదంగా జరిగితే యుద్ధం వచ్చి, అపరిమిత జనక్షయం జరుగుతుందనే సంకోచం ఒక వంకా, దివ్య లోకాలను సంపాదించుకోవచ్చుననే ఆశ మరొక వంకా లాగాయి. అయినా, ధర్మరాజు ఆఖరికి రాజసూయంచేయాలనేనిర్ణయానికే వచ్చాడు.

ఆనిర్ణయం ధర్మరాజుకుఒకవ్యసనంలాగా అయిపోయింది. అస్తమానమూ దాన్ని గురించే ఆలోచించేవాడు. సభలో ఆ యాగానికి తాను చేస్తున్న ప్రయత్నాలను గురించే మాట్లాడేవాడు; తనకురాజసూయయాగంచేసేఅర్హతఉన్నదా అని తన మంత్రులను అడిగేవాడు.

"రాజా, రాజసూయయాగం చేసే అర్హత నీకున్నది. దానిని దిగ్విజయంగా పూర్తిచేసి సామ్రాజ్య భారాన్ని వహించగలవు," అన్నారు మంత్రులు.

తన మంత్రులు కూడా చెప్పారు గనక, ధర్మరాజు నిశ్చయం దృఢమయింది. తనకు బలవంతులైన తమ్ములున్నారు. శత్రు రాజులను జయించి వారి కప్పాలు పుచ్చుకోవచ్చు. పరిస్థితులన్నీఅనుకూలంగాఉన్నాయి.యుద్ధం వస్తుందనీ, జనక్షయం జరుగుతుందనీ ధర్మరాజు వెనకాడదలచలేదు. అయినా, కృష్ణుడి అభిప్రాయం కూడా తెలుసుకుంటే మంచిదని అతనికి తోచింది.

వెంటనే ధర్మరాజు ద్వారకకు కబురు చేశాడు. కృష్ణుడు కొంతమందిని వెంటబెట్టు

## 21. జరాసంధుడి కథ



కుని ఇంద్రప్రస్థానికి వచ్చాడు. మామూలు మర్యాదలూ, ముచ్చటలూ ముగిసినాక ధర్మరాజు కృష్ణుడితో, "కృష్ణా, నాకు రాజసూయం చేయాలనే కోరిక గాఢంగా కలిగింది. దానికి తోడుగా నా హితం కోరిన వారందరూ నాకు ప్రోత్సాహం ఇస్తున్నారు. అయితే, రాజసూయం చేయడానికి ఎంతో సమర్థత కావాలి. అందుకు నా ఒక్కడి శక్తి చాలదు. ఇతరుల సలహా అంతగా నమ్మదగినది కాదు. నీ సలహా నాకు కావాలి. నువ్వు మానెయ్యమంటే ఈ రాజసూయం మానేస్తాను. చెప్పు, నీఆజ్ఞ ఏమిటి?" అని అడిగాడు.

దానికి కృష్ణుడు ఇలా సమాధానం చెప్పాడు:

"ధర్మరాజా, ఏ విధంగా చూసినా నువ్వు రాజసూయం చెయ్యడానికి అర్హుడివే. నీకు అన్నీ తెలుసు. పూర్వం క్షత్రియ వంశాలన్నిటినీ పరశురాముడు చంపగా మిగిలిన ఐలేక్ష్వాకు వంశపు రాజులే నిజమైన క్షత్రియులు. వాళ్ళు కాలక్రమాన నూటఒక్క వంశాలుగా పెరిగారు. యయాతి, భోజవంశాలు పధ్నాలుగయ్యాయి. ఈ రాజవంశాలన్నిటినీ జయించి జరాసంధుడు సామ్రాట్టయి కూర్చున్నాడు. అతను మహాబలుడూ, మహాగర్వీనూ. అతన్ని జయించటం అసాధ్యం. అతని సేనాపతి శిశుపాలుడు. పడమటి దిక్కున రాజుగా వున్న భగదత్తుడు మీతండ్రి అయిన పాండురాజుకు మిత్రుడై కూడా జరాసంధుడికి సేవ చేస్తున్నాడు. జరాసంధుడి పక్షాన ఇంకా అనేకమంది బలవంతులున్నారు. ఈ జరాసంధుడితో వేగలేకనే మేము ద్వారకకుపోయి అక్కడ స్థిరపడ్డాము. జరాసంధుడు బతికి ఉండగా నువ్వు రాజసూయ యాగాన్ని జయప్రదంగా చేయలేవు. ముందు అతణ్ణి ముగించాలి."

ఈ మాటలు విని ధర్మరాజు కొంచెం వెనక్కు తగ్గాడు. అతను కృష్ణుడితో, "రాజులందరూ తమ తమ సుఖాలు తాము చూసుకుంటున్నారే గాని, సామ్రాజ్యాలు నెలకొల్పాలనే ఉద్దేశంతో లేరు. ఉద్దేశం ఉన్నా అది ఏమంత తేలిక కాదు. నేను కూడా ఈ పని తలపెట్టను. మా వంశంలో ముందు ముందు

రాజసూయం చేసే శక్తి గలవాడు రాకపోతాడా అని తృప్తిపడతాను. జరాసంధుడి ధాటికి నువ్వే తట్టుకోలేకపోతే, నీ బలం మీద ఆధారపడిన మేము అతన్ని ఎలా గెలవటం?" అన్నాడు.

ఇందుకు భీముడు ఒప్పుకోక, "ప్రారంభంలోనే నీరుకారిపోయేవాళ్ళు ఏదీ సాధించలేరు. ఉపాయం చెప్పటానికి కృష్ణుడు ఉన్నాడు. నాబలమూ,అర్జునుడిపరాక్రమమూ ఉన్నాయి. బలవంతుణ్ణి సాధించడమే ప్రజ్ఞ!" అన్నాడు.

కృష్ణుడు కూడా జరాసంధుణ్ణి ఉపాయంతో చంపవచ్చునని అన్నాడు.కాని ధర్మరాజుకు ధైర్యం చాల లేదు. "సామ్రాజ్యం కోసం నిన్నూ, నాకు రెండుకళ్ళుగా ఉన్న భీమార్జునులనూ ఆ జరాసంధుడి పైకి పంపలేను. మీరు అతన్ని గెలవలేరు. హాని జరిగిపోతుంది.నాకు రాజసూయం వద్దు," అన్నాడతను కృష్ణుడితో.

ప్రయత్నించని వాడి జన్మ వృథా అనీ, తన గాండీవమూ,అక్షయతూణీరాలూ,రథమూ శత్రుసంహారానికి కాకపోతే మరి దేనికనీ అర్జునుడు అన్నాడు.

ధర్మరాజుకు జరాసంధుడి వృత్తాంతం తెలుసుకోవాలని కోరిక కలిగింది. కృష్ణుడు ఆ జరాసంధుడి వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు:

బృహద్రధు డనేవాడు మగధను పాలించాడు.అతను ఇంద్రుడితో సమానుడు. అతని



వద్ద మూడు అక్షౌహిణుల సేన ఉండెది. కాశీరాజ కుమార్తెలైన కవలలను అతను పెళ్ళాడాడు. కాని ఇద్దరి వల్లా చాలాకాలం సంతానం పొందలేక,ఎన్ని నోములూ ఫలించక, పుత్రకామేష్టి వల్ల కూడా ఫలితం లేక, అతనుచివరకు తన భార్యలతో సహా తపస్సు చెయ్యటానికి బయలుదేరాడు.

వనంలో ఒక మామిడిచెట్టు కింద బృహద్రధుడికి చండకౌశికుడనే తాపసి, గౌతమ వంశం వాడు, కనిపించాడు. బృహద్రధుడు, ఆ చండకౌశికుడికి శ్రద్ధగా శుశ్రూష చేయసాగాడు.

ఒకనాడుచండకౌశికుడు,"నాయనా, నువ్వు చాలాకాలంగా నాకు సేవచేస్తున్నావు.నీ సేవతో



చాలాతృప్తి చెందాను. నీ కేంకావాలో కోరుకో," అన్నాడు.

"స్వామీ, ఎన్ని చేసినా నాకు సంతానం కలగలేదు. పుత్రకామేష్టి కూడా ఫలించలేదు. విరక్తితో రాజ్యాన్ని కూడా వదిలేసి తపస్సు చేసుకుందామని వచ్చాను. నాకింక కోరిక లంటూ ఏముంటాయి?" అన్నాడు బృహద్రధుడు.

ఆ క్షణంలోనే ఒక మామిడిపండు చండ కౌశికుడి ఒడిలో రాలి పడింది.

వెంటనే తాపసి ఆ పండును బృహద్రధుడి కిచ్చి, "రాజా, నీ కోరిక నెరవేరుతుంది. నీకు కొడుకు కలుగుతాడు. నీ రాజ్యానికి తిరిగి వెళ్ళు," అన్నాడు.

బృహద్రధుడు ఆ పండు తీసుకుని, తన ఇద్దరి భార్యలతోనూ తన నగరానికి తిరిగి వచ్చాడు. ఆయనకు ఇద్దరు భార్యలయందూ సమానమైన ప్రేమ కావడంచేత, ఆ పండును రెండు సమభాగాలుగా చేసి, ఇద్దరికీ ఇచ్చాడు. దాని ఫలితంగా ఇద్దరూ ఏక కాలమందే గర్భం ధరించారు.

కాలక్రమాన వారికి వేరువేరుగా పిల్లలు పుట్టారు. కాని ఒక్కొక్క పిల్లవాడికీ సగం శరీరమే ఉన్నది. ఒక కన్నూ, ఒక చెవీ, ఒక చెయ్యీ,ఒక కాలూ, సగం ముఖమూ, సగం కడుపూ గల ఈ పిల్లలు ప్రాణంతో ఉండటం చూసి రాణులు భయపడి, ఏడవ సాగారు. అప్పుడు మంత్రసానులు ఆ సగం సగం పిల్లలను తీసుకుపోయి నగరంలోని ఒక కూడలిలో పారేసి వచ్చారు.

ఆ ప్రాంతంలో జర అనే రాక్షసి ఉంటుం డేది. అది ఈ సగం సగం బిడ్డలను ఎత్తుకు పోవటానికి వచ్చి, అనుకోకుండా రెండు శరీరాలనూ కలిపి పట్టుకున్నది. వెంటనే రెండు భాగాలూ ఏకమై పిల్లవాడుగా ఏర్పడి గట్టిగా ఏడవసాగాడు. ఆ ఏడుపు విని అంతఃపురంలోని రాణులూ, రాజూ పరిగెత్తు కుంటూ వచ్చారు.

ఈ పిల్లవాడు రాజకుమారుడై ఉంటాడని గ్రహించి, జర మానవస్త్రీ రూపుధరించి, ఆ బిడ్డను రాజుకు ఇస్తూ, జరిగిన సంగతి చెప్పింది. ఇదివిని, రాణులు ఇద్దరూ పరమా

నంద భరితులై ఆ పిల్లవాణ్ణి పాలిచ్చి పెంచ సాగారు.

బృహద్రధుడు తన కుమారుడికి జరా సంధుడని పేరు పెట్టుకోవటమేగాక, మగధ దేశమంతటా ఏటా జరకు ఉత్సవాలు జరిగే టట్టు శాసించాడు. తరవాత జరాసంధుడు పెరిగి పెద్దవాడై అసమాన పరాక్రమాలతో అంతులేని రాజులను యుద్ధంలో జయించాడు.

కృష్ణుడు కంసుణ్ణి చంపిన మాట విని జరాసంధుడు మధుర మీదికి వచ్చాడు. ఎందుచేతనంటే కంసుడి భార్యలు జరాసంధుడి కుమార్తెలు.

కృష్ణుడు ధర్మరాజుతో, "రాజా, జరాసంధుడు ఎలాటి శస్త్రాస్త్రాలతోనూ చావడు. అయితే, అతన్ని భీముడు మల్లయుద్ధంలో సులభంగా చంపవచ్చు. నా మాటలో నీకు విశ్వాసం వుంటే భీమార్జునులను నా వెంట పంపు," అన్నాడు.

"అయ్యో, ఎంతమాట! మాకు నువ్వు తప్ప వేరే ఆధారం ఏమున్నది? నువ్వు జరా సంధుడు చావాలని నిర్ణయిస్తే, ఇక అతను చచ్చినవాడే. నీ సంకల్పం ఉన్నట్టయితే నేను రాజసూయం చేసినట్టే భావిస్తాను. నువ్వు వెంట ఉంటే భీమార్జునులు చేయలేని దేమున్నది? మీరు ముగ్గురూ తప్పక బయలు దేరి వెళ్ళి, విజయం పొందిరండి," అన్నాడు ధర్మరాజు.

కృష్ణుడూ, భీమార్జునులూ బ్రాహ్మణ వేషాలు ధరించి ఇంద్రప్రస్థం నుంచి బయలుదేరి,



పద్మసరస్సునూ, కాలకూటాన్నీ, గండకినీ, మహాశోణనూ దాటి, పూర్వకోసలా, మిథిలా నగరం మీదుగా తూర్పు దిక్కు ప్రయాణం సాగించి, మగధదేశం చేరి, గోరథగిరి ఎక్కి, దాని మీది నుంచి రాజధానిని చూశారు. అది చాలా సంపన్నమైన పట్టణం. ఎక్కడ చూసినా జలసమృద్ధీ, పశుసమృద్ధీ వారికి కనిపించాయి. పట్టణం చుట్టూ పెట్టని కోట లాగా అయిదు కొండలున్నాయి. ఆ కారణం చేత దానికి గిరివ్రజమనే పేరు వచ్చింది.

గిరివ్రజంచుట్టూ ఉన్న కొండలలో చైత్యక మనే దాని మీద మూడు భేరీలున్నాయి. ఎవరన్నా పరాయివాళ్ళు నగరాన్ని ప్రవేశిస్తే అవి తమంతట తామే మోగుతాయి. అందు చేత కృష్ణభీమార్జునులు ఆ కొండ మీదికి వెళ్లి, ముందుగా ఆ భేరీలను పగులగొట్టారు. అయితే ఆ ప్రాంతంలోని నగరద్వారం వద్ద సాయుధభటులున్నారు. అందుచేతఈముగ్గురూ అటుగా నగరాన్ని ప్రవేశించక, చైత్యకం శిఖ రాన్ని ఎక్కి, నగరప్రాకారాన్ని దాటి, నగరంలోకి వచ్చారు.

ఆ సమయానికి జరాసంధుడు కొన్ని అపశకునాలు గమనించి, శాంతి చేయటానికి గాను స్నానంచేసి దీక్షలో ఉన్నాడు. ఈ లోపల కృష్ణభీమార్జునులు మాలలు కట్టేవాళ్ళ వద్దకు వెళ్ళి, బలవంతంగా మాలలు తీసుకుని ధరించి, ఒంటి నిండా గంధం పూసుకుని, బ్రాహ్మణ వేషాలతో, జరాసంధుడు ఉన్న చోటికి వెళ్ళారు.

వాళ్ళు నిజంగా బ్రాహ్మణులే ననుకుని జరాసంధుడు ఎదురు వచ్చి, వారికి అర్ఘ్య పాద్యాలు మొదలైన అతిథిసత్కారాలు చేయ డానికి ఉపక్రమించాడు.

కాని, వాళ్ళు వాటిని స్వీకరించకపోగా, మౌనంగా ఉండిపోయారు.

కృష్ణుడు మాత్రం నోరు తెరిచి, భీమార్జును లను చూపి, జరాసంధుడితో, "రాజా, వీరిద్దరూ మౌనవ్రతం పూని ఉన్నారు. అర్ధరాత్రి గడిస్తేనే గాని నీతో మాట్లాడరు," అన్నాడు.

"అయితే, అర్ధరాత్రి అయినాకనే వీరిని సత్కరిస్తాను," అని జరాసంధుడు వారిని యజ్ఞశాలకు పంపాడు.



# వార్తలలో బాలలు

## పుట్టినరోజు కానుక!



పిల్లలు పుట్టినరోజు సందర్భంగా బంధువుల నుంచీ, స్నేహితుల నుంచీ కానుకలు పుచ్చుకోవడం మామూలే. ఆ కానుకలు ఒక్కొక్క సారి పుచ్చుకున్న వారికి ఆనందాశ్చర్యాలు కలిగిస్తాయి. కేరళ, కన్ననూర్ జిల్లా తాళిపరంబాకు చెందిన ప్రవీణ్ అనే పదిహేనేళ్ళ కుర్రాడికి వచ్చిన పుట్టిన రోజు కానుక అటువంటి ఆశ్చర్యాన్నే కలిగించింది. ఇంతకూ ఆ కానుక ఏమిటో తెలుసా? ఆకుర్రాడే రచించిన 108 కవితల సంకలనం! తన కవితా సంకలనం అచ్చవుతున్న విషయం ప్రవీణ్‌కు తెలుసు కాని, అది అప్పుడే సిద్ధమవుతుందని అనుకోలేదు. పిల్లలు కథలూ, కవితలూ రాయడం పత్రికలకు పంపడం, ప్రచురింపబడడం తరచూ జరిగేవే. కాని పిల్లల రచనలు సంకలనంగా అచ్చవడం మాత్రం చాలా అరుదైన విషయం. స్థానిక కేంద్రీయ విద్యాలయంలో పదవతరగతి చదువుతూన్న ప్రవీణ్ - హిందీ, సంస్కృత భాషలలో కూడా కవితలు రాస్తున్నాడు.

## తబలా వాద్య సామర్థ్యం

ఆలిండియో రేడియోలో గాత్ర, వాద్య కచేరీ చేయాలంటే మామూలుగా కనీసం పదహారు సంవత్సరాలు పూర్తయి ఉండాలి. అయినా, పన్నెండేళ్ళ దీపక్ మెహతా ప్రతిభను చూసి ముగ్ధులయిన ఢిల్లీ ఆలిండియా రేడియో అధికారులు ఆ నియమాన్ని పక్కకు పెట్టి, ఆ కుర్రాడికి బి గ్రేడ్ రేటింగ్ ఇచ్చారు. దీపక్ ఆరేళ్ళ క్రితం సొంతంగా తబలా వాయించడం ప్రారంభించాడు. తరవాత అతన్ని టీచర్ దగ్గరికి పంపారు. ఇప్పుడతడు తబలా వాయించడంలోని మెళకువలన్నీ నేర్చుకున్నాడు. 'నేషనల్ టాలెంట్ సెర్చ్ స్కాలర్ షిప్' సాధించాడు. దాని ద్వారా అతడు 20వ యేట వరకు వారి నుంచి సహకారం పొందవచ్చు. దీపక్ మీద జీ టీ.వీ. ఒక డాక్యుమెంటరీ రూపొందిస్తున్నది.

## భారతీయ బాలమేధావి!

బ్రెజిల్‌లోని సావ్‌లోరెంకోలో ఇటీవల 10-14 యేళ్ళ మధ్య వయసు బాలబాలికలకు 'వరల్డ్ యూత్ ఛెస్ ఫెస్టివల్' జరిగింది.ఆ సందర్భంగా జరిగిన బాలల ఛెస్ ఛాంపియన్ షిప్ పోటీలలో భారత దేశం తరఫున ఏడుగురు పిల్లలు పాల్గొన్నారు. వారిలో ఢిల్లీకి చెందిన టానియా సచ్ దేవ్ అనే అమ్మాయి వయసు ఎనిమిదేళ్ళే. ఆ పోటీలలో పాల్గొనడానికి ఆమెకు ఇంటర్నేషనల్ ఛెస్ ఫెడరేషన్ ప్రత్యేక అనుమతి ఇచ్చింది. ఫెడరేషన్ అధ్యక్షుడు, "భారతదేశానికి చెందిన ఈ బాలమేధావిని అనుమతించడానికి నేనెంతో ఆనందిస్తున్నాను," అన్నాడు. "ఆమెనైపుణ్యానికిఫెడరేషన్‌చూపిన ఆదరణ చాలా అరుదైనది," అనిఆసియా ఫెడరేషన్ ప్రెసిడెంట్ ప్రశంసించాడు.



| చందమామ అనుబంధం - 88 | మన దేశపు చెట్లు |
| --- | --- |

# టులీప్

ఆఫ్రికాలోని అంగోలాకు చెందిన టులీప్ చెట్లను మొదట 1870వ సం॥ ప్రాంతాలలో శ్రీలంకకు తీసుకువెళ్ళారనీ, ఆ తరవాత వాటిని మన దేశానికి తీసుకు వచ్చారనీ చెబుతారు. అవి ఇప్పుడు ప్రపంచ దేశాలన్నిటా వ్యాపించి ఉన్నాయి. మన దేశంలో మహారాష్ట్ర సముద్రతీర ప్రాంతాలలో ఈ చెట్లు విరివిగా కనిపిస్తాయి. ఉత్తర ప్రాంతంలో ఎప్పుడూ పచ్చగా కనిపించే ఈ చెట్లు, దక్షిణ ప్రాంతాలలో వేసవికాలంలో ఆకులు రాలుస్తాయి.

వీటి ఆకులు ముదురు పచ్చ రంగులో, ఒకదానికొకటి ఎదురెదురుగా ఉంటాయి. శీతాకాలంలో ఆకుపచ్చ రంగులో అందమైన మెత్తటి మొగ్గలు పుట్టుకు వస్తాయి. కొమ్మల చివర ఎరుపు రంగు పూలు గంటాకారంలో గుత్తులు గుత్తులుగా పూస్తాయి. సెప్టెంబర్ నుంచి మే నెల వరకు పూస్తూ ఉంటాయి. ఈ చెట్లు ఉష్ణ ప్రాంతాలలో మాత్రమే కాయలు కాస్తాయి. కాయలు పొడవుగా మొనదేలి వుంటాయి. మిగతా చోట్ల కాపుకు రావు కాబట్టి, ఈ చెట్ల వ్యాప్తి నెమ్మదిగా సాగుతుంది. వీటి కలప మెత్తగా ఉండడం వల్ల అంతగా ఉపయోగపడదు.

ఈ చెట్టు పూచే పూలు ఎర్రటి గంట ఆకారంలో ఉండడం వల్ల ఆంగ్లంలో దీనిని 'స్కార్‌లెట్ బెల్' అనికూడాఅంటారు. టులీప్ మొగ్గలను పిండితే నీళ్ళు చిమ్ముతాయి కాబట్టి, ఈ చెట్టును ఆంగ్లంలో 'ఫౌంటన్ ట్రీ' అని కూడా పిలుస్తారు.

వృక్ష శాస్త్రంలో దీనిని 'స్పాతోడీ కాంపానులాటా' అని అంటారు. ఈ పేరు కూడా దీని పూవు గంట ఆకారాన్ని బట్టే వచ్చింది. ఇవి ప్రధానంగా అలంకార వృక్షాలు.



మనదేశపు ఋషులు

# పరాశరుడు

కల్మాషపాదుడనే రాజు ఒకనాడు అడవికి వేటకు వెళ్ళాడు. అతడు దారితప్పి కొండ సమీపంలోని ఇరుకైన మార్గం గుండా వెళుతూండగా వసిష్ఠముని కుమారుడైన శక్తి ఎదురయ్యాడు. ఆయనను పక్కకు తొలగి దారి ఇవ్వమన్నాడు రాజు. "నువ్వే పక్కకు తొలగి దారి ఇవ్వ వచ్చు కదా!" అన్నాడు ముని.

ఆ మాటతో ఆగ్రహం చెందిన రాజు, మునిని విల్లుతో కొట్టాడు. ముని, "నువ్వు మనిషిలా నడుచుకోవడం లేదు. జంతువులాగా ప్రవర్తించావు. కాబట్టి, మొదట నీకంటబడే మృగలక్షణాలు నీలో కలుగు గాక!" అని శపించాడు.

అప్పుడే ఒక పెద్ద పులి అటు రావడం చూసిన రాజు, మరుక్షణమే పులిలాగ గాండ్రిస్తూ అటూ ఇటూ చూసి, ఆవేశంతో ముని మీద పడి, ఆయన్ను మింగేశాడు.

ఆ తరవాత అతడు రాక్షసరూపం దాల్చి ఎటో వెళ్ళిపోయాడు.

శక్తిముని పత్ని అదృశ్యంతి అప్పటికే గర్భవతిగా ఉన్నది. కాని పన్నెండేళ్ళ వరకు కానుపు కాలేదు. తల్లి గర్భంలోని శిశువు వేద మంత్రాలు వల్లించడం చుట్టూ ఉన్న మునులు వినసాగారు. ఆఖరికి మగ బిడ్డ పుట్టాడు. పరాశరుడని నామకరణం చేశారు. కపిలుడు, పులస్త్యుడు మొదలైన మునుల శిష్యరికంలో పరాశరుడు విద్యనభ్యసించాడు.

తన తండ్రిని ఒక రాక్షసుడు మింగేశాడన్న విషయం తల్లి ద్వారా తెలుసుకున్న పరాశరుడు, సర్వ రాక్షస వినాశం కోరి ఒక యజ్ఞాన్ని ప్రారంభించాడు. అయితే, ఆ సంగతి తెలిసి తాత వసిష్ఠుడు మరికొందరు మునులనువెంటబెట్టుకుని వచ్చి, యజ్ఞాన్ని ఆపమని కోరాడు. పరాశరుడు అంగీకరించాడు. కాని, అప్పటికే యజ్ఞ గుండంలో అగ్ని రగులుతున్నది. దానిని అలాగే వదిలివేయడానికి లేదు. పరాశరుడు ఆ అగ్నిని తీసి హిమాలయాలకు ఉత్తరంగా విసిరివేశాడు.

హిమాలయాలలో అప్పుడప్పుడు మంటలు పుట్టి అడవులను దహించి, మంచును కరిగేలా చేయడానికి పరాశరుడు విసిరివేసిన యజ్ఞాగ్నియే కారణం అని చెబుతారు!



# మీకు తెలుసా?

1. శాంతికి చిహ్నంగా ఏ పక్షిని చెబుతారు?
2. బ్రిటన్ మొట్టమొదటి మహిళా ప్రధాని ఎవరు?
3. గ్రహాలలోకెల్లా చాలా పెద్దది ఏది?
4. పాము ఎందుకు కళ్ళు తెరుచుకునే నిద్రిస్తుంది?
5. రాజస్థాన్‌లో మాత్రమే కనిపించే పాములు తినే పెద్ద పక్షి ఏది?
6. 'ప్రార్థనా చక్రాలు' ఎక్కడ ఉన్నాయి? వాటిని ఎవరు ఉపయోగిస్తారు?
7. జపానువాళ్ళు రూపొందించిన 'పుష్ప అలంకరణ కళ' పేరేమిటి?
8. ప్రపంచంలోకెల్లా అతి పొడవైన గోడ ఏది?
9. 'ఈఫిల్ టవర్' ఎక్కడ ఉన్నది?
10. థర్మామీటర్‌లో ఉపయోగించే 'ద్రవలోహం' ఏది?
11. అమెరికా మొట్టమొదటి అధ్యక్షుడు ఎవరు?
12. టెలిఫోన్‌ను కనుగొన్నవారెవరు?
13. రంగుల ఉత్సవంగా దేనిని చెబుతారు?
14. ప్రపంచంలో అతి ప్రాచీన మతం ఏది?
15. శ్రీలంక పూర్వనామం ఏమిటి?
16. ప్రపంచంలోకెల్లా చాలా ఎత్తయిన 'మినారెట్' (బురుజు) ఏది?
17. భారతదేశాన్ని నివాస స్థలంగా చేసుకున్న మహిళా నోబెల్ బహుమతి గ్రహీత ఎవరు?
18. బాడ్మింటన్ క్రీడ ఎక్కడ మొదలయింది?
19. గాంధీజీ ప్రజలను ఉపయోగించమని చెప్పిన చేనేత వస్త్రం పేరేమిటి?
20. ఢిల్లీ గుండా ప్రవహించే నది ఏది?

## సమాధానాలు

1. పావురం.
2. మార్గరెట్ థాచర్.
3. గురు గ్రహం.
4. కనురెప్పలు లేవు.
5. కంకణ పక్షి (బస్టర్డ్)
6. టిబెట్‌లో. బౌద్ధులు.
7. ఇకబేనా.
8. చైనా మహాకుడ్యం.
9. ఫ్రాన్స్‌లోని ప్యారీస్ నగరంలో.
10. పాదరసం.
11. జార్జ్ వాషింగ్‌టన్.
12. అలెగ్జాండర్ గ్రాహంబెల్.
13. హెూలీ.
14. హిందూమతం.
15. సిలోన్.
16. ఢిల్లీలోని కుతుబ్‌మీనార్.
17. మదర్ థెరేసా.
18. భారత దేశంలో.
19. ఖాదీ.
20. యమున.




# మంచి అత్త-మంచి కోడలు

కట్టునాగారం అనే గ్రామంలో, పుల్లయ్య అనే వాడుండేవాడు. వాడికి కొత్తగా పెళ్ళయింది. పెళ్ళయిన వారం లోపలే ఆషాఢమాసం చొరబడింది. అత్తా కోడలు, అత్తా అల్లుడు ఆషాఢ మాసంలో, ఒకే ఇంటి గడప దాటకూడదు కనక, పుల్లయ్య భార్యను పుట్టింట్లోనే వదిలేసి, ఆషాఢ మాసం ఎప్పుడు వెళ్ళిపోతుందా అని ఎదురుచూడ సాగాడు.

అలా ఆషాఢం వెళ్ళి శ్రావణం రాగానే, తండ్రి పుల్లయ్యను పిలిచి, "ఒరే, స్వయంపాకం పట్టుకుని శాస్త్రులుగారింటికి వెళ్ళి ముహూర్తం పెట్టించుకునిరా. శ్రావణ తగవు పుచ్చుకుని, మీ అమ్మ వస్తుంది. ఇద్దరూ కలిసివెళ్ళి, మీ అత్తవారింట్లోంచి నీ భార్యను మనింటికి తీసుకురండి!" అని చెప్పాడు.

పుల్లయ్య తల్లి వాడికి ఒక పళ్ళెంలో శేరు బియ్యం, రెండు అరటికాయలు, కొద్దిగా ఉప్పూ చింతపండు సర్దియిచ్చింది. స్వయంపాకం పుచ్చుకుని వాడు, పురోహితుడింటికి వెళ్ళాడు. వాడొచ్చిన సంగతి తెలుసుకుని పురోహితుడు, స్వయంపాకం లోపల పెట్టించి, వాడందులో దక్షిణ ఏమీ పెట్టలేదని మనసులో గింజుకున్నాడు.

అయితే ఆయన పైకి మాత్రం, "ఒరేయ్, పుల్లయ్యా! కొత్తగా పెళ్ళయినవాడివి. ఏంచేసేది—ఇంకా ఒక అరగంట వరకు దుర్ముహూర్తం వుంది. అది వెళ్ళిపోయేదాకా నేను పంచాంగం ముట్టుకోను. ఒక పని చెయ్యి! పెరట్లో కాకరతీగ నేలమీద పాకేస్తున్నది. అరగంటసేపు ఊరికే కూర్చునే బదులు, ఇంటి దగ్గర తొందరపని లేకపోతే, కాస్త దానికి పందిరి వేసి పెట్టు. అరగంట గడిచాక నీకు ముహూర్తం పెట్టి ఇస్తాను," అన్నాడు.

పుల్లయ్య చేసేదిలేక పెరట్లోకివెళ్ళి, కాకర తీగకు పందిరి వేసే ప్రయత్నం ప్రారంభించాడు. ఆ సమయంలో పురోహితుడి భార్య,

జె. ఉదయనాగశిరీష

దేవుడి పూజకుగాను పంచపాత్ర, ఉద్ధరిణి మరికొన్ని చిన్న పాత్రలూ కడుగుతున్నది.

ఆమె పుల్లయ్యను చూసి, "పెళ్ళాన్ని తీసుకొచ్చాక,ఆవిడ మీఅమ్మకు కాస్త సేవ చేసేలా చూడు. నా కోడలూ వుంది ఎందుకూ! మీ శాస్త్రులుగారు, తన చెల్లెలి కూతురని పట్టలేని అభిమానంకొద్దీ కోడలుగా తెచ్చుకున్నారు. ఆ మహారాణిగారు నన్ను పూచిక పుల్లకింద జమకడుతున్నది!" అన్నది.

పుల్లయ్య ఏదో అనబోయేంతలో, పురోహితుడికోడలు పెరట్లోకి వచ్చింది.ఆమె వంటపనిలో వుండడంవల్ల, చేతిలో ఒక పొడవాటి గరిటెవున్నది.ఆమెదాన్నిఅటూఇటూతిప్పుతూ, "ఎంతచెడ్డా మేనత్తవి కదా అని, నేను చాలా వరకు అణిగిమణిగి వుంటున్నాను. గౌరవం ఇచ్చి పుచ్చుకోవాలి. మన ఇంటి గొడవలు ఇతర్లతో చెప్పడం ఎందుకు?" అన్నది గట్టిగా.

ఆ తర్వాత,అత్తా కోడళ్ళిద్దరూ మాటామాటా అనుకుంటూనే,ఎవరి పనులు వాళ్ళు శ్రద్ధగా చేసుకోసాగారు. అయితే, ఈ గొడవ వింటున్న పుల్లయ్యకు మాత్రం — ఈ తంతు రేపటి నుంచి తన ఇంట్లో కూడా ప్రారంభమవుతుందేమో అని బెంగపట్టుకున్నది.

కాకరతీగకు పందిరి వేసే పని పూర్తికాగానే పుల్లయ్య, పురోహితుడి దగ్గరకు వెళ్ళాడు. ఆయనవాడితో,"ఇదుగో,ముహూర్తం పెట్టాను. అదిసరే! వరలక్ష్మీ వ్రతానికి నీ భార్యకు చీర, బంగారం పట్టుకెళ్ళడంకాదు. బ్రాహ్మడికి దక్షిణ ఇవ్వడం నేర్చుకో," అని, తనకు దక్షిణ ఇవ్వలేదన్న ఉక్రోషాన్ని బయట పెట్టాడు.





రులా కోడలు, నన్ను బాగా చూసుకుంటు న్నది!" అనేది.

ఇలా వుండగా—కొత్త కోడల్ని చూడ్డానికని, రామాపురం నుంచి పుల్లయ్య తల్లి చెల్లెలైన లక్ష్మమ్మ వచ్చింది. ఆమెతో పుల్లయ్య తల్లి, తన కోడలిపనితనంగురించిగొప్పగా చెప్పింది. ఆ మాట నిజమన్నట్టుగా కోడలు, లక్ష్మమ్మను విపరీతంగా గౌరవించి మర్యాదలు చేసింది.

తన అక్క అన్నింటికీ కోడలి మీద ఆధార పడిపోవడంతో, లక్ష్మమ్మ పూర్వంలా చనువుగా ఇంట్లో మసల లేకపోయింది. ఆ కారణంగా, ఆమెకు పుల్లయ్య భార్య మీద అసూయ లాంటిది కలిగింది.

లక్ష్మమ్మ వెళ్ళిపోయేటప్పుడు, పుల్లయ్య తల్లితో, "అక్కా! నిన్ను చూస్తే జాలేస్తున్నది. బావగాని, నీ కొడుకుగాని నిన్ను పట్టించు కోవడంలేదు. అందరూ నీకోడలికి బ్రహ్మరథం పడుతున్నారు. ఇక, ఈఇంట్లో నీ పెత్తనం పోయి నట్టే! ఊడగొట్టిన మంచంకోడులా, పాపం మూలపడ్డావు," అన్నది.

చెల్లెలు వెళ్ళిపోయాక పుల్లయ్యతల్లి, ఆమె అన్నమాటల గురించే ఆలోచించ సాగింది. స్నానంచెయ్యడం, భోజనంచెయ్యడం, ఆఖరికి పొలం వెళ్ళే విషయం కూడా భర్త, కొడుకు కోడలికే చెప్పడం—ఇప్పుడావిడకు అవమా నంగా తోచసాగాయి.

ఈ స్థితిలో, ఒకనాడు చాకిరేవుకు ఉతికేం దుకు బట్టలు తీసుకువెళ్ళడానికి ముసలి

ఆ మర్నాడు పుల్లయ్య, తల్లిని వెంటబెట్టు కునిఅత్తవారింటికివెళ్ళాడు. వియ్యాలవారింట జరిగిన మర్యాదలకు తల్లి చాలా సంతోషిం చింది. వరలక్ష్మీ వ్రతం అయిపోగానే, పురోహి తుడు నిర్ణయించిన రోజున కోడల్ని వెంట బెట్టుకుని, ఇద్దరూ సంతోషంగా తమ గ్రామం చేరారు.

పుల్లయ్యకు రోజులు బాగా గడిచిపోతు న్నాయి. వంట పని ఇంటిపనుల్లో చురుగ్గా వుండిపుల్లయ్యభార్య, అత్తగారిమెప్పుపొందింది. అత్త భర్తతో, "కుంచమంత కూతురుంటే, మంచం మీదే కూడన్నారు! కానీ కూతురు మన సొంతం కాదు. భగవంతుడి దయవల్ల నాకు మంచి కోడలు దొరికింది. కన్న కూతు

గౌరమ్మ వచ్చింది. పుల్లమ్మ, ఆవిడతో ఏదో చెప్పబోయేసరికి, "కృష్ణా రామా! అనుకుంటూ కూర్చోక, ఎందుకమ్మా నీకీ ఇంటి వ్యవహారాలన్నీ? కోడలుగార్ని పిలవండి, ఆవిడే చూసుకుంటారు!" అన్నది గౌరమ్మ.

దానితో పుల్లయ్య తల్లికి, తన ఇంటి పెత్తనమంతా కోడలు లాగేసిందన్న బాధ కలిగి, క్రమంగా ఆమెలో మార్పు వచ్చింది. ఇంటి పెత్తనమంతా తానే చెలాయించాలన్న తపనతో ఆమె, కోడలు చేసే పనుల్లో తప్పులు వెదకడం మొదలు పెట్టింది. 'ఇష్టం లేని మొగుడు ఈల కూరలో ఉప్పెక్కువయిందని కొట్టాడన్న' సామెతగా, ప్రతిదానికీ వంకలూ, పేర్లూ పెట్టడం ప్రారంభించింది. ఈవిధంగా, అత్తా కోడళ్ళ మధ్య సూటీ పోటీ మాటలు ప్రారంభమై, ఇల్లంతా గొడవగొడవగా తయారుకాసాగింది. ఇద్దరూ ఒకళ్ళమీదఒకళ్ళు నేరాలు చెప్పి, పుల్లయ్యకు మనశ్శాంతి లేకుండా చేశారు.

పుల్లయ్య ఈ పోరు భరించలేక, పొలం కాపలావంకతో రాత్రిళ్ళుకూడాఇంటికి రావడం మానేశాడు. పుల్లయ్య తండ్రి ఇది గమనించి కొడుకుతో, "మీపిన్నివచ్చి వెళ్ళినప్పటి నుంచీ, మీ అమ్మ ఇలా తయారైంది. దానికి నేను బుద్ధి చెబుతాను. నేను చెప్పినట్లు చెయ్యి. నువ్వు నీ భార్య చెప్పిన మాటలే నమ్మినట్టు నటించు. మీ అమ్మను గట్టిగా కోప్పడు," అంటూ చేయవలసిందేమిటో చెప్పాడు.

ఆ రోజు పుల్లయ్యపొలం నుంచి ఇంటికి రాగానే,తల్లి కోడలిమీద ఏదో నేరం చెప్పబోయింది. వెంటనే పుల్లయ్య కోపంగా, "అది



అన్నీ చేసిపెడుతూంటే సుఖంగా తిని కూర్చోక, ఏవేవో గొడవలు తెస్తావెందుకు? ఇష్టం లేక పోతే చెప్పు, నా పెళ్ళాన్ని తీసుకుని ఎటయినా వెళ్ళిపోతాను. నాన్న ఇచ్చే వాటా కూడా నాక క్కర్లేదు," అన్నాడు.

ఇదివిని వాడి తల్లి మండిపడి, దొడ్లో వున్న భర్త దగ్గరకు పరిగెత్తిపోయి, "పెళ్ళామొచ్చాక తల్లి అల్లమవుతుందన్నమాట నిజమే!" అంటూ పుల్లయ్య అన్నమాటలు భర్తకు చెప్పింది.

పుల్లయ్య తండ్రి, కొడుకు వద్దకు వచ్చి, "ఒరేయ్, పెళ్ళాన్ని అదుపులో పెట్టుకోలేని వాజమ్మా; పోతేపో! మీ అమ్మనేమన్నా అంటే నేనూరుకోను," అన్నాడు.

"అలా బుద్ధిచెప్పండి వెధవకి. నాకు మీరు న్నారన్న సంగతి మర్చిపోయాడు పనికిమాలిన సన్యాసి," అన్నది పుల్లయ్య తల్లి సంతోషంగా.

పుల్లయ్య హేళనగా నవ్వుతూ, "నీకు నాన్న వున్నట్టే, నీకోడలికి రక్షణగానేనున్నాను. నాన్న నిన్ను వెనకేసుకొస్తే, పెళ్ళాంమాటలు విన్నట్టు కాదా? నాన్న నీమాట వినాలి, నేను మాత్రం నీ కోడలి మాట పట్టించుకోకూడదు. ఆడా మగాకలిసికట్టుగా వుంటేనే సంసారం. ఏదో నీ అత్త పెత్తనం పోయిందన్నభ్రమలో మాత్రం పడకు!" అన్నాడు.

పుల్లయ్య మాటలు వినగానే తల్లికి తన తప్పు అర్థమైంది. ఆమె విచారంగా, "ఒరే, పెత్తనం జారిపోయిందని చెప్పాడు మాటలు విని భ్రమపడ్డాను తప్ప, ఆలోచిస్తే నీ భార్య నన్ను కన్నతల్లిలా చూసుకుంటున్నది. అత్తగారి ననే అహంకారం, నా కళ్ళు కప్పింది," అన్నది.

కొంచెం దూరంలో వుండి అంతా వింటున్న పుల్లయ్య భార్య, అత్తమామలకు నమస్క రిస్తూ, "ఏదో పెద్ద పెద్ద మాటలు వల్లిస్తున్నానని అనుకోకండి. తల్లి కేకలేస్తే, బుద్ధి చెప్పింది అంటుంది లోకం. అదే అత్తగారు కేకలేస్తే ఆరడి పెడుతున్నదని చెప్పుకుంటారు. అత్త గట్టిగా కోప్పడినా, తన మంచికే కోప్పడుతున్న దని నమ్మే కోడలిగా — నా అత్తగారిలో మా అమ్మను చూసుకుంటాను," అన్నది.

ఆ తర్వాత నుంచీ వాళ్ళిద్దరూ ఎంతో కలుపుగోలుగా వుంటూ, మంచిఅత్త—మంచి కోడలు అని నలుగురిచేతా మెప్పుపొందారు.





# చిలిపి పిశాచాలు

చోడేపల్లి అనే గ్రామంలో రామేశం, సోమేశం అనేవాళ్ళ గుడిసెలు పక్క పక్కనే వుండేవి. వాళ్ళిద్దరూ మంచి స్నేహితులు. ఆ రెండు గుడిసెల మధ్యా ఒక నేరేడు చెట్టువుండేది. వాళ్ళు ఆ చెట్టు మొదట్లోచిన్న అరుగు కట్టుకున్నారు.వీలు దొరికినప్పుడల్లా, నేరేడుచెట్టు నీడలో, ఆ అరుగుమీదకూర్చుని కబుర్లు చెప్పుకునేవారు.

ఒకనాడు ఆ ఇద్దరూ తీరుబాటుగా ఆ అరుగు మీద కూర్చుని మాట్లాడుకుంటున్న సమయంలో రామేశం,"సోమేశం! ఏదో ఒక నాడు మనం బోలెడు డబ్బు సంపాయించి మేడలుకట్టుకున్నా, మధ్యలో ప్రహరీ లేకుండా, ఈ చెట్టును ఇలాగే వుంచి, ఇక్కడే కూర్చుని కబుర్లు చెప్పుకుందాం," అన్నాడు.

"ఆ,అలాగే,దానిదేముంది రామేశం! కానీ నాదొక సలహా, కాదనకు. ఈ మట్టి అరుగు మీద పాలరాళ్ళు పరిపిద్దాం.పెద్ద ఖర్చేంకాదు, ఐదు వేలలో పని జరిగిపోతుంది," అన్నాడు సోమేశం.

ఇందుకు రామేశంఏదో అనబోతుండగా, బయట త్రాడుమీదఆరవేసినబట్టలుతీసుకు పోవడానికి వచ్చిన రామేశం భార్య, "అద్దం పగిలిపోయింది, పట్నం వెళ్ళి కొత్తది తెమ్మని పదిరోజులుగా పోరుతున్నాను. ఇలా ఊసుపోని కబుర్లతో కాలంగడపకపోతే,అలా పట్నం వెళ్ళి రాకూడదా?" అన్నది.

"మావి ఊసుబోని కబుర్లా? ఏ క్షణాన సిరి వచ్చి గుడిసె తలుపు తడుతుందో తెలియదు! సమయానికి మేము గుడిసెలో వుంటామా లేదా అని గొడవ పడుతున్నాం," అన్నాడు రామేశం చిన్నగా నవ్వుతూ.

అదేసమయంలో, ఇల్లూడ్చిన తుక్కు బయట పారబోయడానికి వచ్చిన సోమేశం భార్య, "ఎలుకలబోను తెచ్చిపెట్టమని ఎన్నాళ్ళుగానో చెబుతున్నాను, నువ్వుపట్టించుకుంటే

మాచిరాజు కామేశ్వరరావు



పోతూ, "దిక్కుమాలినఅద్దాలూ,ఎలుకబోనులూ! మనం ఈ అడవిలోంచి ప్రాణాలతో బయట పడగలమంటావా సోమేశం?" అన్నాడు.

"భయపడకు! వర్షం కాస్త తగ్గుముఖం పడితే, అర్ధరాత్రికైనా ఇళ్ళకు చేరుకోగలం. ఇదిపేరుకు అడవేగాని, ఇందులో పులులూ, సింహాలూ లేవు గదా," అన్నాడు సోమేశం.

ఆ తర్వాత అర్ధరాత్రి ప్రాంతాన వానపూర్తిగా వెలిసిపోయింది. బ్రతుకుజీవుడా అనుకుంటూ ఇద్దరూ ఇంటిదారిపట్టి కొంతదూరం నడవ గానే, ఒకచోట మర్రిఊడలను పట్టుకుని ఉయ్యాలలూగుతూ కోలాహలంగా నవ్వు తున్న, రెండు ఆడ పిశాచాలు వాళ్ళ కళ్ళ బడ్డాయి.

గదా!" అంటూ చేత వున్న చేటను విసిరి నేలకు కొట్టింది.

భార్యలు అక్కణ్ణించిపోగానే, ఇక ఈ పోరు భరించలేమనుకుంటూ పట్నంబయలుదేరారు స్నేహితులిద్దరూ. పట్నం చేరాలంటే, దారిలో వున్న ఒకచిట్టడవిని దాటాలి. చీకటి పడే లోపల తిరిగిఇళ్ళకుచేరాలనుకుంటూ వేగంగా నడవసాగారు. అయితే, వాళ్ళుచిట్టడవి మధ్యకు చేరేసరికి, హఠాత్తుగా ఉరుములూ మెరుపు లతో కుండపోతగా వర్షం ప్రారంభమైంది.

చేసేది లేక రామేశం, సోమేశం ఒకపెద్ద చింతచెట్టుకిందతలదాచుకున్నారు. అంతలో వర్షంతోపాటు దూరంగా పిడుగుపడిన శబ్ద మైంది. రామేశం భయంతో గడగడ వణికి

రామేశం, సోమేశంపిశాచాలుతమనుచూడక ముందే వెనుదిరిగి పారిపోదామనుకున్నం తలో, అవి వాళ్ళను చూడనే చూశాయి. వాటిల్లో ఒకటి పొట్టిపిశాచం, రెండవదిపొడుగుపిశాచం.

పొట్టిపిశాచం గట్టిగాచప్పట్లుచరిచి, "మీ కొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు. దగ్గరకు రండి!" అన్నది.

ఇద్దరూ బిక్కుబిక్కుమంటూ వచ్చి పిశా చాల ముందు నిలబడ్డారు. అప్పుడు పొడుగు పిశాచం, "ఆశ్చర్యపోకండి. మీ ఇద్దరికీ పెళ్ళిళ్ళ య్యాయా?" అని అడిగింది.

ఇదేం ప్రశ్న అని అప్పటికి కాస్త స్థిమితపడి ధైర్యం కూడగట్టుకున్న రామేశం, "పెళ్ళిళ్ళయి నయి గనకే, ఈ ఇక్కట్లు! పెళ్ళాల మాట

కాదనే ధైర్యంలేక పట్నం బయలుదేరాం," అంటూ, ఆచిట్టడవిలో ఎలాచిక్కుకు పోవడం జరిగిందో వాడు పిశాచాలకుచెప్పాడు.

అంతావిన్న పొట్టి పిశాచం పొట్టచెక్కల య్యేలా నవ్వి, "ఇంతకూ మీకు పెళ్ళాలంటే భయమా? ప్రేమా?" అని అడిగింది.

"భయం, ప్రేమా—రెండూనూ!" అన్నారు రామేశం, సోమేశం.

"మేము మీలాంటి వాళ్ళకోసమే చాలా చూస్తున్నాం. మీరు ఇంటికి వెళ్ళగానే మేం చెప్పినట్లు చేయాలి!" అన్నవి పిశాచాలు.

"అలా చేస్తే మాకేం లాభం?" అన్నాడు రామేశం.

పిశాచాలు రెండూ తమలో తాము కూడ బలుక్కుని, "మేం చెప్పినట్టు చేసి, అందుకు మీభార్యల ప్రవర్తన ఎలావుందో రేపు రాత్రికి ఇక్కడికివచ్చిచెబితే — ఇద్దరికీ చెరోబంగారు కాసూ ఇస్తాం," అన్నవి.

బంగారు కాసుమాటవింటూనే రామేశం, సోమేశం ఆనందపడి, "సరే, ఏంచేయాలో చెప్పండి!" అన్నారు.

పిశాచాలు వాళ్ళకు ఏం చేయాలో చెప్పి, "ఇంతకుమించి మరొక్కమాట కూడా మాట్లాడ కూడదు, వెళ్ళండి. రేపురాత్రి ఇదే వేళకు రండి!" అన్నవి.

రామేశం, సోమేశం పిశాచాలు చెప్పింది మననం చేసుకుంటూ, అర్ధరాత్రి దాటాక ఇళ్ళకు చేరుకున్నారు.



తలుపు తీస్తూనే రామేశం భార్య, "చేతు లూపుకుంటూ వచ్చావు, అద్దం ఏదీ?" అన్నది.

రామేశం జవాబేమీ చెప్పకుండా, ఆమెను విసురుగా పక్కకు తోసి వెళ్ళిపోయాడు.

"నీకేమైనా పిచ్చిపట్టిందా?" అని ఆమె తలుపును దభీమంటూ మూసింది.

ఇక సోమేశం పెళ్ళాం తలుపు తెరిచి, భర్త చేతిలో ఏమీ లేకపోవడం గమనించి, "ఎలుకల బోనెక్కడ?" అన్నది. దానికి జవా బుగా సోమేశం, పెళ్ళాం భుజం పట్టుకుని గట్టిగాకుదిపిలోపలికివెళ్ళిపోయాడు. జరిగినదా నికి నిర్ఘాంతపోయిన సోమేశం పెళ్ళాం, "నిన్నేదో పిశాచి పట్టినట్టున్నది!" అంటూ అరి చింది.



మర్నాటిరాత్రి చిట్టడవి చేరిన రామేశం, సోమేశాలు తాము చేసినదానికి భార్యలేమన్నదీ పిశాచాలకు చెప్పారు.

ఆ మాటలు విన్న పిశాచాలు రెండూపొట్ట చెక్కలయ్యేలా చాలాసేపు నవ్వుకుని, మర్రి చెట్టు తొర్రలోంచి రెండుబంగారు కాసులుతీసి, ఇద్దరికీ చెరొకటి ఇచ్చాయి.

అవి తీసుకుని ఆనందంగా వెళ్ళబోతున్న వాళ్ళిద్దర్నీ, "ఆగండాగండి!" అంటూ పిశాచాలు ఆపి, "మా ఇద్దరిలో కాస్త చిలిపితనం పాలెక్కువ. ఏమీ అనుకోకండి. అయినా, మీఇద్దరికీ ఇంకా మరిన్ని బంగారు కాసులు సంపాయించాలన్న కోర్కె లేదా?" అని అడిగాయి చిలిపిగా నవ్వుతూ.

"కోర్కె లేకపోవడం ఏమిటి? నాకు రేపీ వేళకు లక్షాధికారి కావాలనున్నది!" అన్నాడు రామేశం.

"అంతకాలం నేనోపలేను! సూర్యోదయానికల్లా కోట్లకు పడగలెత్తాలని వున్నది నాకు, నిజం!" అన్నాడు సోమేశం, జేబులో వున్న బంగారుకాసును తడువుకుంటూ.

ఆ మాటలకు పిశాచాలు రెండూ ఒకదాని తల ఒకటి పట్టుకుని కాసేపునవ్వి, "కోర్కెలుండడంతప్పేంకాదు! అట్లని, ఈ అడవిలోవున్న గంధపుచెక్క, ఎర్రచందనం దొంగిలించబోయి జైలుపాలవకండి. సరే! రేపు మరొక బంగారు కాసు కావాలంటే, మేంచెప్పినట్టుచేసి, మీ భార్యల ప్రవర్తన ఎలా వున్నదీ చెప్పాలి," అంటూ,వాళ్ళుచేయవలసినదేమిటోచెప్పాయి.

ఆ రాత్రి ఇళ్ళకు తిరిగి వస్తూనే రామేశం, సోమేశం భార్యలమీద గట్టిగా విసుక్కుంటూ, "మీవి శని ముఖాలు! అందువల్లే, లక్షలకు లక్షలు సంపాదించే శక్తి వుండీ, రోజుకు నాలుగు రూపాయలు కూడా సంపాయించలేక పోతున్నాం! మీకు సిగ్గెగ్గులు వుంటే పుట్టిళ్ళకు పారిపోండి," అన్నారు.

ఈ తిట్లకు రామేశం, సోమేశం భార్యలు పెదవివిప్పలేదు.అలామౌనంగావుండిపోయారు.

ఆ రాత్రి వాళ్ళిద్దరూ పిశాచాలకు జరిగింది చెప్పి, "ఆశ్చర్యం! మా పెళ్ళాలు పుట్టింటికి వెళ్ళమని తిట్టినా ఏమాత్రం చలించలేదు, బాధపడలేదు," అన్నారు.

ఎంతగానోనవ్వుకునిసంతోషించాలనుకున్న పిశాచాలకు, వాళ్ళు చెప్పింది చాలా నిరుత్సాహం కలిగించింది. అవి రెండూ ఏకకంఠంగా, "ఛీ! ఏమన్నపెళ్ళాలు మీ పెళ్ళాలు? మా భర్తలు అలా తిట్టగానే మేం పెరట్లోవున్న నూతుల్లో దూకి చచ్చి, ఇలా పిశాచాలయ్యాం. మీ పెళ్ళాలు మరీ మొండిఘటాల్లావున్నారు," అన్నవి.

"మొండి ఘటాలమే కాదు — మీ లాంటి బుద్ధిలేనివాళ్ళం కూడా కాదు!" అన్న మాటలకు చిలిపి పిశాచాలతో పాటు రామేశం, సోమేశంలు కూడా ఉలిక్కిపడ్డారు.

భర్తల ప్రవర్తనలో వచ్చిన మార్పుకు కారణం తెలుసుకోవడానికి కూడబలుక్కుని, చీకట్లో వాళ్ళవెనకేవచ్చిన రామేశం, సోమేశం భార్యలకు — దీనికంతకూ కారణం, ఈ రెండు చిలిపిపిశాచాలని తెలిసిపోయింది.

వాళ్ళు వెంట తెచ్చుకున్న వేపమండలతో పిశాచాలను ఎడాపెడా బాదడం మొదలు పెట్టారు. పిశాచాలు కీచుకీచుమంటూ మర్రి ఊడలమీదినుంచి, దాపులనున్న చెట్లకొమ్మల మీదికిదూకి, అక్కణ్ణించిగాలిలోకి ఎగిరి కనబడకుండా పారిపోయినై.

ఈజరుగుతున్నదంతావిస్తుపోయి చూస్తున్న రామేశం సోమేశంలతో వాళ్ళు, "చేసిన నిర్వాకంచాలు, ఇక ఇళ్ళకు పదండి!" అంటూ గుడ్లురుముతూ చూశారు.

తమకూ పిశాచాలతోపాటు వేపమండల దెబ్బలు తప్పవనుకున్న రామేశం, సోమేశంలు కాస్తస్థిమితపడి, భార్యలతో, "కొంచెం ఆగండి! చెట్టుతొర్రలో పిశాచాలు దాచిన బంగారు కాసులు ఉన్నట్టున్నవి," అంటూ, తొర్రలో వెతగ్గా చాలా బంగారుకాసులు దొరికాయి.

వాళ్ళు ఇళ్ళకు తిరిగివచ్చి, ఆ కాసుల్ని చెరిసగం పంచుకుని, పూరిగుడిసెలను పీకి, అక్కడ చిన్న డాబా ఇళ్ళు కట్టుకున్నారు.

తర్వాత, పేదరికం అనుభవించే రోజుల్లో, నేరేడు చెట్టుమొదట్లో పాలరాళ్ళ అరుగంటూ చెప్పుకున్న ఊసుపోని కబుర్లను నిజంచేస్తూ —అక్కడ పాలరాయిఅరుగుకట్టించుకుని రామేశం,సోమేశం ఎంతోఅన్యోన్యంగా జీవించసాగారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



L. Bhavani



Taji Prasad

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రంగప్రవేశానికి ముందు!

రెండవ ఫోటో : రంగులతో కనువిందు!

పంపినవారు : టి. చంద్రశేఖరరెడ్డి

పోస్టల్ ఇన్‌స్పెక్టర్, గుడివాడ - 521 301. కృష్ణాజిల్లా (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

CHANDAMAMA (Telugu) February 1996 Regd. No. M. 4854